# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక





4 అణాలు
25-11-53

ANDHRA PATRIKA ILLUSTRATED WEEKL

పంచతంత్రం

# సంధి-విగ్రహం




కర్త:... విశ్వాత్ముల నరసింహమూర్తి




































సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.




సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 47
సంచిక 12
25.11-53

విజయ కార్తీక బహుళ పంచమి బుధవారం

మహాబలిపురంలో పల్లవులచే నిర్మించబడిన దీపస్తంభం.

ఫోటో : అనుముల సురేంద్రనాథ్—[illegible]

## విషయానుక్రమణిక





## ★ అక్షర తూణీరం ★

శ్రీమదాంధ్ర రాజకీయ భారతం
ప్రస్తుతం శాసనసభావర్యగతం.
కమ్యూనిష్టులు కమ్యూనిష్టులు
మాయాద్యూత వ్యసనావిష్టులు

ప్రజాస్వా'మ్యాదవ' కులంలో ముసలం
జన్మించిందని తెరలో కలకలం.
ఎంత తరిచినా అమృతంబదులు హాలాహాలం
ఎంత పాడినా రాసభాల కోలాహలం.

రసికలోకం వారి ప్లేబాక్ నాయకుడు
ఏవేళ కాపాట పాడు మంచి గాయకుడు.
వికటించిందా లక్ష్మన్నకు సంజీవి?
ఏమగునోగదా మంత్రివర్గ భావి!

వెనకటివాటికంటె బావుంటుందనీ,
పొడిచేస్తుందనీ, అనుకున్నాం గానీ,
తెన్నేటి విశ్వనాథ రామాయణం
అంతరమ్ముగా లేదంటున్నారు జనం.

"అదిగో విశాలాంధ్ర, ఇదిగో హైదరాబాదు"
ప్రజలు నమ్మినంతకాలం ఢోకాలేదు.
ఇండియాకు భాషా ప్ర'యుక్త వయస్సు'
ఇంకా రాలేదని పండిట్‌జీ వచస్సు.

మంత్రి కొక్కంటికి రెండేసి నాలికలు
ఇక కావలసినన్ని వాగ్వర్ష ప్రణాళికలు.
ఈలోగా మనకు భాష ఒకటె ధారకం
మంత్రిత్వం భుక్తిముక్తిదాయకం.

నా అక్షరాల లక్ష్యం కానేకాదు కర్నూలు,
దానివెనక పొంచున్న రాజకీయాలు.
వినోదంమీద ప్రభుత్వం పన్నులు,
ప్రభుత్వంమీద నా వినోదం 'పన్ను'లు.

—సవ్యసాచి.

# కాలక్షేపం

"ఆయువు నూఱు వత్సరము;
 లందు సగంబు నశించె నిద్రచేఁ-
బా యటిలో సగంబు గత
 మయ్యెను బాల్యజరాప్రసక్తిచేఁ
బాయక తక్కినట్టి సగబాలు
 గతించు బ్రయాసవృత్తిచేఁ-
బాయువు చంచలం బగుడు
 బ్రాణులకెట్లు సుఖంబు చేకుఱున్?"

తా॥ ఆయుస్సు 100 సంవత్సరములు. అందులో సగము నిద్రావస్థలో ఖర్చు అయిపోతుంది. మిగిలిన సగములో సగభాగము బాల్యావస్థవల్లను, ముసలితనమువల్లను గతించిపోతుంది. మిగిలిన దానిలో సగంభాగం భుక్తికొరకై పనిపాటులు చేసికొనడంలో గడచిపోతుంది. ఆయుః ప్రమాణము యీ విధంగా చలించిపోతూ ఉంటే, ప్రాణులకు సుఖము ఎట్లా లభిస్తుంది?

మనిషియైనవాడు నూరు సంవత్సరములు బ్రతుకగలడు అనే సిద్ధాంతం ఒకటి మన దేశంలో ఉంది. కాని నూరు సంవత్సరములకు మించి 120 సంవత్సరములుగాని 150 సంవత్సరాలు గాని జీవించినవాళ్లు యీ యుగంలో కూడా అప్పుడప్పుడు అక్కడక్కడ ఉన్నారని లోకవార్తగా వింటూ ఉంటాము. గాంధి మహాత్ముడు తాను 120 సంవత్సరముల కాలము జీవించుటకు సంకల్పించినానని అనేక పర్యాయములు చెప్తూఉండేవాడు. కాని, అటువంటి మహాపురుషులు రెండు షష్టిపూర్తి ఉత్సవాలు మాత్రమే గాక షష్టి షష్టిపూర్తి ఉత్సవాలు జరిగినపిమ్మట అవతారము చాలించినప్పటికీ, వారు లేనిలోపమునకై సంతాపము లోకము చెందుచుండ గలదు.

కాశిలోని హిందూ విశ్వవిద్యాలయ ప్రతిష్ఠాపకులైన కీర్తిశేషులగు పండిత మదనమోహన మాలవ్యాగారు వార్ధక్యము వచ్చినతర్వాత తిరిగి శరీర దార్ఢ్యమును పొందు నిమిత్తమై తపస్వీ బాబాయను ఒక స్వామీజీ ఉపదేశానుసారముగా కాయకల్ప చికిత్సను పొందియుండిరి. ఈ కాయకల్ప చికిత్స పూర్తియైన పిమ్మట, మాలవ్యాగారికి తిరిగీ కొత్త జవసత్త్వలు కొంతవరకు వచ్చినట్లుగా మాలవ్యాగారు అన్నారు. కాయకల్పచికిత్స అనేది బూటకము కాదనిన్నీ మన ఆయుర్వేదములో చెప్పబడిన కాయకల్పచికిత్సా ప్రకరణము ప్రసిద్ధిలోనికి రావలసినదే అనిన్నీ స్వానుభవ మిది దెల్పుచున్నానని సాక్షీభూతముగా హెచ్చరించారు. అందులో ముఖ్యముగా కుటీర చికిత్సాపద్ధతి మాలవ్యాగారికి చేయబడెను. మోదుగచెట్టుయొక్క లేత యిగురులతోనూ శ్రేష్ఠమైన తేనెతోనూ యీ చికిత్స జరుపబడెనని, మాలవ్యాగారి చికిత్స పూర్తియైన పిమ్మట, దానిని గూర్చిన వివరములు కొన్ని వెల్లడింపబడెను. మాలవ్యాగారు ఆ చికిత్స పొందిన దినములలో ఒక మంత్రమును కూడా జపించుచుండవలసినదిగా గురువు ఆజ్ఞఅయినట్లుగా తెలిసింది. ఆ జపమును మాలవ్యాగారు ఎక్కువ శ్రద్ధగా పట్టుదలతో చేసినట్లయితే ఆ చికిత్సవల్ల వారికి యింకా ఎక్కువ గుణముకలిగి యించుమించు తిరిగీ యౌవనము కలిగేది. ఈ కాయకల్ప చికిత్సా ప్రభావము ఎంతవరకు నమ్మదగినదనే విషయములో దానిని శ్రద్ధగా పరీక్షచేస్తేనే గాని లోకం నమ్మజాలదు. కాని, ఒక్క విషయం విస్మరించడానికి వీలులేదు. ఈ కాయకల్పచికిత్స చేయించిన తపస్వీ బాబాగారికి అప్పటికి వయస్సు 150 సంవత్సరములని పత్రికలలో ప్రకటింపబడెను. ఇప్పుడు వారికి 160 సంవత్సరములు వయస్సు అని అవలీలగా అంచనా వేయవచ్చు. ఇటువంటి అద్భుతమైన కాయకల్ప చికిత్సావిధానమును మన దేశములోని వైద్యవిశారదులు శోధించి సాధించి లోకానికి బోధించుటకు ఎందుచేత శ్రద్ధవహించరనే అనుమానము కలుగుతుంది.

స్వదేశీయమైన వైద్యవిద్య యెడల యింకా పూర్తిగా మన ప్రభుత్వానికి అభిమానం ఆదరణ కలుగలేదు. అటువంటి పరిశోధనలన్నీ చేయించడానికి ఆయుర్వేద పరిశోధనాలయాలు కావాలి. అట్టి పరిశోధనాలయాలకు కావలసిన పండితప్రవీణులు ఎక్కడనుంచి లభిస్తారో నిర్ధారణ చేయవలసి ఉంటుంది. మహాతపస్సంపన్నులు ఏ హిమాలయ పర్వతప్రాంత కాంతారములలో ఉన్నారో ఎవరు వెదకి వెలికి తీసికొనిరాగలరు? "అయ్యా! మీకు మాసవారీ జీతమిచ్చి పోషిస్తాం. కావాలంటే, కారుకూడా యిస్తాము. మీరు మా కాయకల్ప కాలేజీ లేబరేటరీలో (పరిశోధనాలయంలో) పనిచేస్తామని పదేళ్లు కంట్రాక్టు కాగితం వ్రాసియిస్తారా?" అని నెహ్రూ ప్రభుత్వము తాలూకు ఆరోగ్యవైద్యశాఖా మంత్రి శ్రీమతి రాజకుమారీ అమృతకౌరు గారు కబురు చేస్తే ఆ హిమాలయపర్వత గుహాలలోనుంచి ఆ తపస్వి తప్పకుండా ఢిల్లీకి వస్తాడా? అదే అనుమానం—. అది అంతా యతి నృపతి సంవాదంలోకి దిగుతుంది.

"చేరి భిక్షాన్న మారగించెదము మేము;
కట్టెదము దిక్కులనియెడి కలితశాటి;
బవ్వళించెద మిలయను పాన్పుమీద;
నేమి కార్యము మాకు నరేంద్రులందు?"

భిక్షాన్నము ఆరగిస్తాము. దిగంబరులముగా ఉంటాము. కటిక నేలనే పాన్పుగా చేసికొని పవ్వళిస్తాము. కనుక, మాకు రాజులతోను అయిశ్వర్యవంతులతోను ఏమి పని కలదు? అని ఆ తపస్సంపన్నులు తర్కిస్తారు. అటువంటి దిగంబరులకు తెలిసిన మూలికలను, చికిత్సా ప్రణాళికలను సేకరించడం అంటే, సులభసాధ్యమైన పని కాదు. రాజులతో మాకేమి పని? రాజకుమారీ అమృతకౌరుతో మాకేమి పని? అనేటటువంటి దిగంబరులు ఢిల్లీవీధులలోకి వస్తారా? ఢిల్లీలోని రాజభవనాలకు వస్తారా? అవసరమైనవాడు ఆ మహాత్ముల కోసం హిమాలయములకే వెతుక్కుంటూ పోవాలి. యోగి నరసింహస్వామిగారు తూర్పుగోదావరి జిల్లాలోని అమలాపురము నుండి చిన్న వయస్సులోనే బయలుదేరి హిమాలయప్రాంతములకు వెళ్లి అక్కడ "గిరిగహ్వర గుహావిహార తత్పరమతియై" తిరిగి తిరిగి తపస్సమాధిలోనున్న ఒక ముని పుంగవుని సందర్శించి తన జన్మ ధన్యమైనదన్నట్లుగా ఆ యోగిపుంగవునిసన్నిధి తనపాలిటి పెన్నిధిగా ఎంచి, వారి యనుగ్రహమున అనేక అమూల్య యోగరహస్యములను గ్రహించి తరించినట్లుగా నరసింహయోగిగారు కొంత కాలముక్రింద వెల్లడించియున్నారు.

కాని, మన ప్రభుత్వతత్త్వమునకే బైరాగి

## ★ కాలక్షేపం ★

తత్వం గిట్టదు. గాంధిమహాత్ముడు మోకాలు దాటని ముతక అంగవస్త్రం కట్టుకొని తిరిగి నందుకు ఆయనను చూచి అసహ్యించుకొని "Half-naked Fakir" "అర్ధ దిగంబర ఫైగంబరు ఇతడు" అని ఆంగ్లేయప్రధాన మంత్రియైన చర్చిలుగారు చాలాకాలం హేళనచేశారు. గాంధిమహాత్ముడు ఒకనాడు యీ పొట్టి అంగవస్త్రమును కట్టుకొనుటకై తీర్మానించి ఆనాటినుంచీ అదే వస్త్రధారణదీక్ష వహించాడు. ఆ దీక్షా ప్రారంభ దినమున తన దీక్షయొక్క పరమార్థమును వివరిస్తూ యంగు యిండియా పత్రికలో ఒక వ్యాసం కూడా ప్రకటించాడు. అప్పుడు ఆ వ్యాసమును విమర్శిస్తూ ఆనీబీ సెంటమ్మ చాలా హేళనగా వ్యాఖ్యానం చేసింది. "ముతక ఖద్దరుగుడ్డను అందరూ కట్టుకోవలెనని ప్రబోధించడం పరిహాసపాత్రంగా ఉంటుంది. వస్త్రముల నేత విషయంలో అత్యంత సుందరమైన నక్షి పని చేసే పనివాళ్ళు ఉన్నారు. అటువంటి కళాప్రావీణ్యమును ప్రోత్సహించకుండా నిరుత్సాహపరచడం అవ్యక్తం-అవివేకం. అంతే కాకుండా, మోకాళ్ళు దాటని మొరటు గావంచాను కట్టుకొని బహిరంగ సభలలోకి వచ్చి ప్రసిద్ధుడైన ప్రజానాయకుడు పదిమందిలో కూర్చుండుట కేవలం అసహ్యం. స్త్రీల సమావేశములలోనికి యిటువంటి వేషంతో వచ్చి తిరగడం అసభ్యం." అని ఆనీబీసెంటమ్మ ఆక్షేపించింది. మహాత్ముని అంగవస్త్రం ఆ అంగనామణిని ఆవిధంగా అనవసరంగా కంగారుపరచింది. ఆమె మాత్రము సన్నని పసందైన జరీ అంచు వస్త్రములను ధరించేది. మంచి పనితనం గల్గిన కళాప్రావీణ్యం ఆమె వస్త్రలావణ్యంలో ఉండేది. ఆయన వేషమును ద్వేషించిన ఆనీబీసెంటమ్మకు నూరేండ్లు నిండినవి. వేరే లోకానికి వెళ్ళిపోయింది కాని, ఆమె భారతజాతిమాత కాలేదు. పూజిత బాపూజీ మాత్రము భారతజాతి పితగా పూజితుడైనాడు.

అటువంటి మహాత్ముడు తన జీవితమును తానే తృణప్రాయంగా పరిగణించేవాడు. మరణముకోసం ఎదురుచూస్తూ ప్రాయోపవేశదీక్షలు ప్రారంభించేవాడు. నెలలతరబడి దీర్ఘోపవాసములు సాగించేవాడు. "నా జీవితానికి భీమాకూడా చేయలేదు. కనుక నాది విలువలేని జీవితం" అని పలికినటువంటివాడు తన ఆహారవిషయంలో అమితమైన నియమనిగ్రహములతో గట్టి పట్టుదలతో తనకు కావలసిన పదార్థములను తెప్పించుకొని ఆరగించేవాడు. తన రక్తపు పోటు ఏవిధంగా ఉన్నదో ఎప్పటికప్పుడు డాక్టరులచేత పరీక్ష చేయించుకొనేవాడు. తన ఆరోగ్యం కించిత్తయినా చెడకుండా అహోరాత్రము శ్రద్ధవహించేవాడు. "నేను 120 సంవత్సరాలు జీవించవలెను" అనే సంకల్పం "మమ ఆయుష్యాభివృద్ధ్యర్థం" అన్నట్లుగా ఆయన మనస్సులో ఉంటూనే ఉండేది.

చిరకాలం జీవించవలెననే సంకల్పంలోనే అసలైన ఆరోగ్య లక్షణం ఉంది. మనస్సుకు ఆయుస్సుకు ఏమైనా సంబంధం ఉన్నట్లయితే, ఆ విషయానికి ఉదాహరణము లనేకం చూపించవచ్చు. "నాయనా! అమ్మాయికి టెలిగ్రాం యిచ్చారా? ఎప్పుడు వస్తుంది అమ్మాయి?" అని కళ్ళు తెరువలేక కలువరించిన 90 ఏళ్ల ముసలమ్మ, ఏక్షణం"హరీ!"అంటుందో అని ఆమె మంచం చుట్టూ కంచెలాగున కన్న కొడుకులు కనిపెట్టుకొని ఉంటే, ఏ విధమైన ఆహారధారకం లేని నిరాధారస్థితిలో మూడు రోజులు ఆ ముదుసలి సజీవియై యుండి, బహుదూర ప్రాంతంనుంచి ప్రయాణంచేసి బండి దిగి వచ్చిన తన కుమార్తె యింటిలోనికి వచ్చి "అమ్మా!"అని పిలువగానేఆసక్తితో కళ్లు తెరచి తన ప్రేమానురాగంవల్లనే తన ప్రాణం నిలిచిఉన్నదని చూపించి, తన తనువు చాలించిన సందర్భములు ఆత్మసంకల్ప ప్రభావ నిదర్శనములనుట నిస్సంశయం - అవి. కాకతాళీయ విషయములు గాని, అసంబద్ధ విషయములు గాని కావు. అట్టి ముసలివాండ్ల విషయములో ముమ్మాటికీ కావు. ఉత్తరాయణ పుణ్యకాలము వచ్చేవరకు అవసాన దశలో అంపశయ్యమీద భీష్ముడు భీష్మించి ఉన్నాడంటే ఉత్తమాట కాదు.

"ఆయువు చంచలం" కావచ్చు. కాని,

(52 వ పేజీ చూడుడు)

# ఆ రోజుల్లో విన్న సంగతిమీద ఈ రోజుల్లో ఓ కల

**కవికొండల వేంకటరావు**

పై పేరుతో ఒక కథ నేడు వ్రాయగలుగుతూ వున్నానూ అంటే - మా వసతిగృహానికి వరదఅనంతరం కొత్తగా దరుజుచేసి వెల్లవేయబట్టి అనుకోండి; మఱీన్నీ శరత్కాలం కూడా వచ్చింది. చిరుచలి ప్రారంభించింది తెల్లవాఱగట్ల. ఇంకా అనుకూలమైన దేశకాల పాత్రలను వివరించవలసివస్తే, నూతనంగా ఆంధ్రరాష్ట్రం వచ్చింది. పగలు తెల్లటి మేఘాలు దూదికొండల్లా ఆకాశంమీద నిలబడివుంటూ వున్నాయి! అమావాస్య రాత్రిళ్లు చుక్కలు మింట ప్రకాశమానంగానూ, ఆ చుక్కల్నే అన్నింటినీ కలోసి జుట్లు ముళ్లేట్టి, మూటకట్టి, అద్దపుబరణిలో క్రిక్కిరిసేలాగు నక్కింపజేసినట్టు పవర్ణమీదేవి, పూరా చంద్రబింబం పరిఢవిల్లేని. మఱీన్నీ దసరా వుత్సవాలు అవుతూ వున్నాయి. సరస్వతీ పూజలు, దుర్గారాధనలు, గిలకల పండగలు, వీరవినోదాలు ఇవన్నీ ఆరేలకు ముఖ్యాంగాలుగా వుండి వేడుక గొల్పుతూన్నాయి. నేనున్ను ఒక తెల్లవాఱుజామున "రగ్గు" కాళ్లమీదకు తీసుకుని, లోపల గుండెకాయ "లబ్ డబ్" దెబ్బలిస్తూవుంటే, జోకొట్టులా, కళ్ళు మూసుకుంటూ కలకంటూ వున్నాను.

కల అంటే కలకాలముండేదానిలా తోచింది. మీరంతా "కల" అంటే అప్పటికప్పుడు కనబడి హారతికర్పూరపు హారతిలా అంతమొంది పోయేనని అనుకుంటారులాగుంది. అలాంటి కలకాదు నాది. నా కలలో మనుష్యులు తల్లక్రిందులుగా నడచేరు. అవ్యక్తంగా మాటాడేరు. నేనూ నా ప్రకృతిరూపంలో వారి నర్తం చేసుకుంటూ, ఈ శరీరంయొక్క వేధ మేధ అన్నీ దాటివేశే గాథలో పడ్డానేమో అన్నట్లు, అన్యత్రాపాత్రగా ప్రవర్తిస్తూ వుంటాను. వరు డెవడైనా ఆ కల తీరుకన్నాడా, ప్రత్యక్షంగా మంచంమీద నిదరోతూ నేనూ, నేనే అవల నాటకంలో పాత్రలాగూ రెండూ ఒకే రకపు శరీరములుగా ఒకేరకపు గొంతుకలు దాల్చివున్నట్టు తోచితీరుతుంది. అయితే నాకు నేనే కలకంటూ వున్నానేమో, అద్దంలో చూచుకొన్నట్టు నా రూపు నాకే కనిపించేని. అంత అలా కనబడ్డా "ఇక్కడకెల్లా వచ్చావు నీవు?" అనే ప్రశ్న పొడమలేదు. అంత సమైకంగా ఆ మాయలో పడిపోయి ఆ కర్మకొండను అనుసరిస్తూవున్నాను.

పర్ణశాలమీద పక్షిగా నిలిచి, పాపికొండలమీద పడవలాగయిపోయి, పట్టిసం ఆ ప్రాంతానికి వచ్చేసరికి కడవలాది కల్లో, వెల్లప్పానకమో అన్నంత నురుగుతో పెరుగుతో వీరభద్రుణ్ణి ముంచెత్తి, మయ్యేరు కట్టతెగినట్టు అయి, అయ్యేరు విసురు చూపెడుతూ వుంది. "ఓయి! ఒయ్యోయి!" అంటే, "ఇంకేముంది? ఒయ్యోయి!" అని రయితులూ, "ఏమల్లోయి! ఏంచేదాం?" అని పల్లెటూళ్ళ ఆడవాళ్ళు, ఆ జనపద ప్రాంతాన్ని అలజడి పోసాగారు.

అది వుదయమే! బాగా వెలుగొచ్చింది! చెట్టూ పిట్టా ఎక్కడున్నది ఏమంటూ వున్నది తెలుస్తూనే వుంది. "అయితే అంధకారమన్నది అరుబయటది కాదు. అంతఃకరణది!" అన్నట్టు ప్రతీ మనిషియొక్క అంతరంగంలోను అదో తరంగము వడిచుట్టి సుడిగుండం తిప్పేస్తూవున్నట్టు అయిపోయింది.

ఆపొద్దు ఆమెకు నీళ్లాడుపొద్దు. నులకమంచంమీద, మోకాళ్లోతునీళ్ళల్లో నీళ్లాడి పిల్లణ్ని కని వాళ్ళు మఱచి వుందన్నారు. మంచంక్రింద కుంపటీ పెట్టడానికి వరదనీరు, మంచంకోళ్ల ఊసిఊసి కదలిస్తూవుంది. లేడీడాక్టరు సాయంపొందడానికి అది గట్టుక్రింద ఎదో పల్లెటిపట్టు. జలం చుట్టు తిరిగి మెట్టెక్కి ఊళ్లో పడిందంట! ఊరంతా తప్పించుకు, కొందఱు తాడిచెట్ల కెగ్రాకి, కొందఱు మఱ్ఱివూడ లట్టుకు వ్రేలాడి, కొందఱు ముందఱకు వెళ్ళి వెనక్కు వచ్చి, "చచ్చామ్రో" అని కూతేసి, చావకుండా బ్రతక్కుండా బావురుపిల్లుల్లా, గుంటనక్కల్లా, ఈతబడి ఏర్పాటుగా కాపడేరు.

ఒక్క ఈమే ఎవరికీ అగపించడంలేదు. అప్పుడు పుట్టినపిల్ల కొత్తనీట తెప్పన తేలిపోతూవుంటే, తల్లి పురటాలు మునివ్రేళ్లమీద నిలబడి బుజాన్ని మోస్తుందా? మోకరించి వేయిదేవుళ్ళకూ మ్రొక్కుతుందా?

ఆమెముందు 'ఏడుకొండలోడు' ఎత్తుగా సాక్షాత్కరించాడేమో, పురిట్లో పిల్లనలా త్రోసేసింది. ఆ త్రోసివేత తెగింది తల్లీపిల్లా యొక్క కలగలపు బొడ్డుప్రేగు. పిల్ల విడివడింది. తల్లి పడిపోయింది. పిల్ల తేల్తూ, అరఫర్లాంగు దూరంలో తేరుకుంది. తల్లి తెప్పరిల్లింది. పిల్ల ఫర్లాంగుదూరంలో వరదనే ఎవరిచేతనో పైకెత్తబడి లాలింపబడింది. తల్లి ఆదోపాలనగా పరకాయిస్తూ బ్రహ్మానందభరితురాలై తనదారి తాను వెతుక్కోసాగింది. నులకమంచం నులకమంచం లేగిపోయి గుడిసెకో పిలకలా మెఱసిపోయింది.

పురటాలు ఒక బొప్పాసిచెట్టు నాధారం చేసుకు, ఆ గొట్టాలంట చిమ్మటి గొట్టినట్టు నీరు కొడుతూవుంటే, అటు తిరిగి ఇటుతిరిగి అన్ని కొమ్మలా తన బాహువు లాంచి, రాహుకేతువులిద్దఱూ ఒక్కుమ్మడి పట్టి పాలార్చినట్టు ముఖం మూపెట్టసాగింది.

ఏలాగో, నానుడిలా, నాడిలా వ్యాపించిపోయింది నక మొకాల! "బొప్పాసిచెటుమీద ఆమె పురుడోసుకొంది" అంటే "పురుడోసుకొంది!" అని వెంటనే దేవలోకంలో విడ్డూరం! "మరి పాలకు కొదవతే"దని మానవలోకంలో ప్రచారం. "ఇంతకూ పుట్టినపిల్ల ఏమైంది?" అని అడిగిన పాపాన్ని ఒక్కడూ పోలేదు ఆ జనపద ప్రాంతాన్ని. అంతా వేళాకోళమాడినవారే "ఈ జలఝంఝూటనకు తోడు ఝంఝామారుతం వీస్తే ఆ బొప్పాసిచెటు పసతేలిసేని!" అని. ఆమెమాత్రం, ఆపురటాలు మాత్రం, "దేవుని ఘుట్టి మనలో వున్నంతసేపు, ఏచోటయినా ఘుట్టే, ఏ పుట్టయినా

(48-వ పేజీ చూడండి)

# శనిదేవత రథచక్రం



(పెద్ద కథ) మూలం: నికొలాయ్ వి. గొగోల్.

అకాకీ ఉదయాన్నే లేచి జిల్లాపోలీసు అధికారి యింటికి వెళ్ళాడు. అధికారి నిద్రపోతున్నారని నౌకర్లు చెప్పారు. మళ్ళీ పదిగంటలకి వెళ్ళాడు. ఆయన ఇంకా నిద్రపోతూనే వున్నాడని చెప్పారు. కొస్త ఆగి మళ్ళీ పదకొండు గంటలకి వెళ్ళాడు. "సూపర్నెంటుగారు ఇప్పుడే వళ్ళి చూసెరు," అని నౌకర్లు చెప్పారు. భోజనాల వేళకి మళ్ళీ వెళ్ళగా, అధికారి తాలూకు గుమాస్తాలు అకాకీని లోపలికి వెళ్ళనివ్వలేదు. "ఇక్కడ నీకేం పని?" అని అడిగారు. అకాకీకి జీవితంలో మొదటిసారిగా కొంత కోపం వచ్చింది. అధికారిని స్వయంగా చూడవలసివుందనీ, తన్ను లోపలికి వెళ్ళకుండా వారు అడ్డగించలేరనీ, తాను ప్రభుత్వ న్యాయశాఖనుండి వచ్చాననీ, తను ఫిర్యాదుచేస్తే అప్పుడు తెలుస్తుందనీ అన్నాడు.

గుమాస్తాలు దీనికేమీ సమాధానం చెప్పలేక పోయారు. వారిలో ఒకడు పోయి అకాకీ వచ్చినసంగతి అధికారికి చెప్పాడు. అధికారి కథంతా విన్నాడు. విని, అసలు విషయం మాట్లాడకుండా అకాకీని ఏదేదో ప్రశ్నించాడు. అంత అర్ధరాత్రివేళ అకాకీ ఆవేపు ఎందుకు తిరగవలసివచ్చింది? అలా రాత్రిళ్ళు తిరగడం అతనికి అలవాటా? జారచోర గృహాలకి వెళ్ళాడా? ఈ ప్రశ్నలతో అకాకీకి మతిపోయింది. మారు మాట్లాడకుండా వెనక్కి వచ్చేశాడు.

ఆ రోజంతా అతను ఆఫీసు చాయలకు పోలేదు. ఆఫీసు మానెయ్యడం జీవితానికల్లా ఇదే మొదటిసారి. మర్నాడు ఆఫీసుకు వెళ్ళాడు. మామూలు "తుంటుగుడ్డ" ధరించాడు. పాతకోటు మరీ అసహ్యంగావుంది. కొత్తకోటు దొంగిలించబడిందనే వార్త చాలమంది హృదయాలను కలచివేసింది. కొందరు ఉద్యోగులు మాత్రం, అకాకీని సందు దొరికితే పనిగట్టుకుని ఏడిపించే మనస్తత్వం కలవాళ్లు ఉన్నారు. వాళ్లు ఇంత మంచి అవకాశం మళ్ళీ రాదని అకాకీని మరికొస్త ఏడిపించారు.

నిజంగా సానుభూతి కలిగినవారుమాత్రం చందాలు పోగుచేసి అకాకీకి ఇవ్వాలని ప్రయత్నం చేశారు. కాని అందరూ డైరెక్టరుగారి రూపచిత్రం తయారీకి ఇదివరకే చందాలు వేసివున్నారు. పైగా ఆ డివిజన్ హెడ్ గుమాస్తాగారు తన స్నేహితుడు వ్రాసిన పుస్తకానికి దేనికో, తన కింది ఉద్యోగు లందరిచేతా చందాలు వేయించాడు. అందుచేత అకాకీకోసం చందా వసూలు చేయవలసివచ్చేటప్పటికి చాలకొద్ది మొత్తమే వసూలయింది.

వారిలో ఒకడికి అకాకీమీద చాలాజాలి కలిగింది. ధనసహాయం చేయలేకపోయినా, సలహా అయినా యిద్దామని యిలా చెప్పాడు: "నువ్వు పోలీసులదగ్గిరికి వెళ్ళబోకు. ఎవడైనా పోలీసుఅధికారి తన పై అధికారుల మెప్పుకోసం ఒక వేళ, నీ కోటు వెదికి పట్టుకున్నా, అది నీదేనని చట్టరీత్యా తేలేదాకా పోలీసుల చేతినుండి బయట పడదు. అందుచేత నువ్వు సూటిగా (ఫలానా) పెద్దమనిషి దగ్గిరికి వెళ్ళు. ఆ పెద్దమనిషి తన పలుకుబడి ఉపయోగించి ఆయా అధికారులచేత వ్యవహారం త్వరగా తెమిలేటట్లు చేయగలడు—"

గత్యంతర మేమీ లేనందున అకాకీ అకాకియెవిచ్ (ఫలానా) పెద్దమనిషి దగ్గిరికి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. ఆ పెద్దమనిషి అధికార 'హోదా' యేమిటో యిప్పటికీ అజ్ఞాతంగానే వుంది. ఆయన యీవలనే పెద్దమనిషి అయ్యాడనీ, ఇప్పటిదాకా చిన్నమనిషిగానే వుండేవాడనీ పాఠకులు గ్రహించాలి. అదీగాక ఆయన పెద్దమనిషితనం ఆయనకంటె పెద్దమనుషులైనవారి పెద్దమనిషితనంతో పోల్చిచూస్తే చెప్పుకోదగింది కాదని కూడా గ్రహించాలి. అయితే కొందరు దేన్నయితే అప్రధానంగా పరిగణిస్తారో, దాన్నే మరికొందరు అత్యంత ప్రధానంగా పరిగణిస్తారు. ఈ (ఫలానా) పెద్దమనిషి తన ప్రాధాన్యాన్ని వృద్ధిచేసుకోడానికి అష్టమైన పద్ధతులూ అవలంబించేవాడు. ఉదాహరణకి, తక్కువ తరగతి ఉద్యోగు లెవరైనా వస్తే, వారిని మేడ మెట్లమీదనే కలుసుకుని

అనువాదం: నండూరి రామమోహనరావు

మాట్లాడి పంపేసేవాడు. ఆయనతో పని వున్నా ఎవడూ సరాసరి దర్శనం చేసుకోడానికి వీల్లేదు. బోలెడుమంది గుమాస్తాల ద్వారా లిఖితపూర్వకంగా దర్శనం చేసుకోవలసిందే. 'పవిత్ర రష్యా' దేశంలో, పులిని చూచి నక్క వాతలు పెట్టుకోనే పద్ధతి అంటువ్యాధిలాగ వ్యాపించివుంది. ప్రతివాడూ తన పైవాణ్ణి అనుకరించడానికే ప్రయత్నిస్తాడు. ఒకసారి ఒక చిన్న గుమాస్తాకి ప్రమోషన్ వస్తే యిలాగే జరిగిందట. అతన్ని ప్రత్యేకంగా ఒక చిన్న ఆఫీసుకు హెడ్డుగా నియమించారు. వెంటనే అతగాడు ఆఫీసులో ఒక భాగం తనకోసం కేటాయించుకుని అద్దాలు కట్టుకున్నాడు. దాంట్లో ఒక మేజాబల్ల పట్టేటంత జాగా కూడా లేనప్పటికీ, అందులోనే తన్ను చూడవచ్చేవారిని కూర్చోబెట్టేవాడు. ఆ వాటా గుమ్మందగ్గర ఒక బంట్రోతును ఉంచాడు. ఆగంతుకులు వచ్చినప్పుడల్లా వాడే తలుపు తీసి ప్రవేశపెట్టేవాడు. ఇదంతా ఆ గుమాస్తా గారు హోదాకోసం పడే ప్రాకులాట.

ఇక ఇందాకటి పెద్దమనిషి సంగతి: ఆయన అలవాట్లు, ఆచారాలు దాబుసరిగా వుంటాయి గాని కొంత మోతాదు మించివుంటాయని పిస్తుంది. ఆయన పసతికి పునాది నిక్కచ్చితనం. "ఖచ్చితం, ఖచ్చితం, ఎప్పటికీ ఖచ్చితమే!" అని బల్లగుద్ది చెప్పి ఎదుటి మనిషి కళ్ళలోకి చూసేవాడు. నిజానికి అలా చూడవలసిన అవసరం లేదు. ఎందుకంటే ఆయనదగ్గిర పనిచేసే పదిమందీ ఆయనంటే నిత్యమూ హడలిపోతూ వుంటారు. ఆయన్ని దూరాన చూడగానే చేస్తున్న పని వదిలిపెట్టి, అంతా లేచి నుంచునేవారు. ఆయన తమ్ము దాటిపోయేవరకూ అలాగే వరసగా చేతులు కట్టుకు నుంచుని తరవాత కూర్చునేవారు. ఆయన ఉద్యోగులతో మాట్లాడటం మహో[illegible]గా వుండేది. ఎప్పుడూ యీ కింది వాక్యాలే ఉపయోగించేవాడు: "ఏం, కొవ్వెక్కిందా?" "ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా?" "నీ ముందు నుంచున్న మనిషి ఎవరో తెలిసే మాట్లాడుతున్నావా?"

ఈ కొస్తా మినహాయిస్తే, ఆయనంత దయార్ద్రహృదయుడూ, స్నేహశీలీ లేడు. స్నేహితుడు అడిగినది కాదనలేడు. తనకంటె పైవారి సమక్షంలో, చాలా కంగారుపడి ప్రవర్తించేవాడు. తనతో సమానులైనవారి దగ్గిర, తనంత మంచివాడు లేనట్లు ప్రవర్తించేవాడు కాని తనకంటె కిందితరగతి మనుషులు కనిపించారో, మనిషి చిత్రంగా మారిపోయేవాడు. ఒక్కసారిగా పెదవులకు తాళం వేసుకునేవాడు. ఒక్కొక్కసారి



"ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా? తెలుసా? తెలుసా అని!"

వాళ్లతో సరదాగా మాట్లాడాలనే కోరిక అతని కళ్లలోంచి తొంగిచూసేది కాని మళ్లీ తన్ను తనే హెచ్చరించుకునేవాడు: "నీకంటె తక్కువవాళ్ళతో మాట్లాడటం మంచిదేనా? లోకువైపోవూ? నీ గొప్పదనం తరిగిపోదూ?" అని. ఈ హెచ్చరిక ఫలితంగా, అతను పెదవుల తాళం తీయకుండా మూగవాడిలాగ కూర్చునేవాడు. మరీ అవసరమైతే "ఆ, ఊఁ, ఓ, ఏం," అని కొన్ని ధ్వనులుమాత్రం చేసి పూరుకునేవాడు. దీనితో అతనికి 'మూగనాయన' అని పేరు వచ్చింది.

ఈ పెద్దమనిషి దగ్గిరికి అకాకీ కార్యార్థియై వెళ్ళాడు. వెళ్ళినవేళ అకాకీకైతే మంచిది కాదుగాని పెద్దమనిషికి మాత్రం సరిగ్గా కావలసిన వేళ. ఆవేళకి ఆయన తన ప్రయివేటు గదిలో కూర్చుని ఎవడో చిన్ననాటి స్నేహితుడితో మాట్లాడుతున్నాడు. ఆ స్నేహితుడు చాల సంవత్సరాల వియోగానంతరం కొత్తగా పెద్దమనిషిని కలుసుకున్నాడు. ఇంతలో 'బాష్మాచ్కిన్' అనే పేరుగల మనిషి దొరగార్ని చూట్టానికి వచ్చాడని బంట్రోతు వచ్చి తెలిపాడు. పెద్దమనిషి "ఎవ్వడా వాడు?" అని అతినిర్లక్ష్యంగా అడిగాడు. "ఎవరో ఉద్యోగి సార్" అన్నాడు బంట్రోతు. "కాస్సేపాగమను వాణ్ణి. ఇప్పుడు వీల్లేదు," అన్నాడు పెద్దమనిషి.

వీల్లేదనటంలో పెద్దమనిషి పెద్ద అబద్ధం ఆడాడని చెప్పక తప్పదు. చిన్ననాటి మిత్రుడితో మాట్లాడవలసిన విషయాలన్నీ అయిపోయాయి. కొంతసేపటినుంచీ స్నేహితులిద్దరూ మాట్లాడడాని కేమీ లేక ఒకరి మొహం లొకరు చూసుకుంటూ, గోళ్ళు

# ★ శనిదేవత రథచక్రం ★

గిల్లుకుంటూ కూర్చున్నారు. అప్పుడప్పుడు ఒకరి వీపు ఒకరు తట్టి "ఇంకా ఏమిటోయ్ విశేషాలు ఇవాన్ అబ్రామోవిచ్?" "ఏమున్నాయోయ్ విశేషాలు సిపాన్ వార్లామోవిచ్" అనుకుని మళ్ళీ మౌనంలో పడుతున్నారు. అందుచేత అకాకీతో మాట్లాడడానికి అతనికి కావలసినంత తీరిక వున్నది. కాని తన దర్శన భాగ్యంకోసం ఏ వుద్యోగి అయినా పడగాపు లుండవలసిందేనని, తన మిత్రుడికి ఎరుక పరచాలనే సరదాకోసం అలా ఆజ్ఞాపించాడు.

చివరికి ఎంత ప్రయత్నించినా మిత్రుడితో మాట్లాడడానికి మాట దొరకని పరిస్థితి వచ్చింది. పడక కుర్చీలో హాయిగా జేర్లబడి కాల్చడం మొదలెట్టిన చుట్టకూడా పూర్తిగా కాలిపోయింది. మౌనం సహించరానిదిగా వుంది. అప్పుడు హఠాత్తుగా జ్ఞాపకంవచ్చినట్టు నటించి, తలుపుదగ్గిర ఏవో కాగితాలు పట్టుకు నుంచున్న తన సెక్రటరీతో "ఆ. నాకోసం ఎవడో కాచుకున్నాడల్లే వుంది. వాణ్ణి లోపలికిరమ్మను," అని ఆజ్ఞాపించాడు. అకాకీ లోనికి వచ్చాడు. అతడి వాలకం, చిరిగిన బట్టలూ చూడగానే "ఏం కావాలి నీకు?" అని పెద్దమనిషి కఠినస్వరంతో గద్దించి అడిగాడు. (పెద్దమనిషి ప్రస్తుతపు హోదాలో ప్రవేశించడానికి ముందు వారంరోజుల పాటు తన ప్రయివేటు గదిలో అద్దంముందు నుంచుని ఆ కఠినస్వరమూ, అప్పటి భంగిమా అభ్యాసం చేసుకున్నాడు.)

అసలే భయవివశుడైవున్న అకాకీ యీ గద్దింపుతో మరింత బెదరిపోయాడు. అతనికి మాటకిముందు "చాలా" ఉపయోగించడం బాగా అలవాటు. ఈ కంగారులో మరికొన్నిసార్లు ఆమాట ఉపయోగించి చేతనైంతవరకూ తన పరిస్థితి విన్నవించుకున్నాడు. తన కోటు చాలా కొత్తదనీ, దాన్ని దొంగలు చాలా యిదిగా దొంగిలించారనీ, తనకి చాల యిదిగా వుందనీ, దొరగారు కరుణించి పోలీసు అధికార్లతో మాట్లాడి తన కోటు వెదికించి యిప్పించాలనీ, మనవిచేశాడు.

అకాకీ యిలా మనవి చెయ్యడం ఏ కారణంచేతనో క్షమించరాని అపరాధంగా తోచింది పెద్దమనిషికి.

"ఏమిటయ్యా, ఆ వేలాపన? ఎవరితో మాట్లాడుతున్నావో తెలియదూ? మంచీ మర్యాదా అక్కర్లేదూ? దీనికోసం నాదగ్గిరికి వచ్చావా? నువ్వు ముందు మా ఆఫీసుకు పిటీషను పెట్టాలి. అది డిపార్టుమెంటు హెడ్డుకి, అక్కణ్ణించి డివిజన్ హెడ్డుకి, అక్కణ్ణించి సెక్రటరీకి వెడుతుంది. సెక్రటరీ నాకు తెచ్చియిస్తాడు. అదీ జరగవలసిన పద్ధతి. అంతేగాని నీ యిష్టం వచ్చినట్లా చేద్దామనుకుంటున్నావా?"

"దొరగారు కోప్పడితే చెప్పలేను,"అని అకాకీ తనకి చేతనైన నాలుగుమాటలూ పోగుచేసి సమాధానం చెప్పబోయాడు. ముచ్చెమటలు కారుకుంటూ "కాదు సార్. సెక్రటరీల్ని నమ్మడానికి వీల్లేదండి. వాళ్ళు మంచివాళ్ళు కారండి," అన్నాడు.

"ఏమి టేమి టేమిటీ?" అని ఆశ్చర్యపడినట్లు అభినయించి పెద్దమనిషి గొంతు హెచ్చించాడు: "ఎంత ధైర్యం! ఎంత సాహసం! ఎంత—ఎంత పొగరు! ఈ రోజుల్లో కుర్రాళ్లకి పెద్దమనుషులతో మాట్లాడ్డమే తెలియదు. ఛీ!" అన్నాడు. పెద్దమనిషి అకాకీ వయస్సు దగ్గిరి దగ్గిరగా యాభై వుంటుందని గుర్తించినట్టులేదు. ఒకవేళ గుర్తించికూడా అతన్ని కుర్రాడుగా భావిస్తున్నాడంటే, అతన్ని డెభ్భయ్యేళ్ళ వాళ్లతో పోల్చి వుండాలి. "ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా? నీముందు నుంచుం దెవరో తెలుసా? తెలుసా? తెలుసా? తెలుసా అని," అంటూ యింటికప్పు ఎగిరిపోయేలాగ అరిచి, బల్లమీద పిడికిలితో ఘన్‌మని శబ్దంచేశాడు. ఈ శబ్దానికి అకాకీకంటె ధైర్యవంతుడే ఆగలేడంటే అకాకీ అసలు నిలబడలేడని ఊహించవచ్చు.

అకాకీ పంచేంద్రియాలూ కాసేపు తమ తమ పనులు మానేసి జడత్వం పొందాయి. వణికాడు, తూలిపోయాడు; బంట్రోతులు అతన్ని అవతలకి సాయం పట్టకపోతే అక్కడే కుప్పకూలిపోయేవాడే. స్మృతిలేని స్థితిలో అతన్ని మోసుకెళ్ళారు. పెద్దమనిషి హృదయం ఆనందంతో కుప్పిగంతులు వేసింది. తన గొంతుకవల్ల అనుకున్న దానికంటె గట్టిగా పని జరగడం, తన గద్దింపుతో వొక మానవుడు స్పృహ తప్పి పడిపోవడం, ఇదంతా అతనికి పట్టరాని సంతోషం కలిగించింది. తన స్నేహితుడేమనుకుంటున్నాడో నని క్రీగంటితో చూశాడు. మిత్రుడుకూడా కొద్దిగాభయపడుతున్న సూచనలు కనిపెట్టి మరింత సంతృప్తిపడ్డాడు.

అకాకీకి తను మేడమెట్లు ఎలా దిగాడో, ఎలా వీథిలో పడ్డాడో జ్ఞాపకంలేదు. అతని కాళ్లూచేతులూ స్వాధీనంతప్పాయి. జీవితంలో ఏ పై అధికారిచేతా యిన్ని తిట్లు తినలేదు. వీథుల్లో మంచుతుపాను రేగుతోంది. తుపానులోపడి నోరుతెరుచుకుని నడవసాగాడు. ఈదురుగాలి అన్ని వేపుల్నించీ మొత్తేస్తోంది. ఒక్క మాటకూడా మాట్లాడలేని స్థితిలో అతడు యింటికి వచ్చాడు. గొంతుక వాచిపోయింది. మొదలు నరికిన చెట్టులాగ పక్కమీద పడిపోయాడు. సమర్థుడైన మనిషితిట్లు ఒక్కొక్కప్పుడు ఎంతపనైనా చేస్తాయి!

మర్నాడు తీవ్రంగా జ్వరం వచ్చింది. సెంట్ పీటర్స్‌బర్గ్ నగర వాతావరణం దయవల్ల అతని జ్వరం అనుకున్నదానికంటె త్వరితంగానే ఉగ్రతరూపం దాల్చింది. అందుచేత డాక్టరు తీరిక చేసుకుని వచ్చి, రోగి నాడి పరీక్షించేసరికి, ఇక చేయవలసిన దాట్టే కనిపించలేదు. కాకపోతే వైద్యశాస్త్ర ప్రయోజనాలు రోగికి పూర్తిగా లేకుండా యెందుకు పోవాలని ఏదో మందిచ్చాడు. రోగి ఇక ముప్ఫయ్యారు గంటలకంటె యెక్కువ జీవించడని నిర్ధారణగా చెప్పాడు. ఇంటి యజమానురాలి కేసి తిరిగి "మీ రితనికోసం వృథా శ్రమపడవద్దు. చవకగా ఒక శవపేటిక మాట్లాడి వుంచండి, యిప్పుడే," అన్నాడు.

అకాకీ యీ మాటలు విన్నాడా? వింటే, అతని మనస్సు క్షోభించిందా? సౌఖ్యలేశమైనా రుచిచూసి యెరగని తన వ్యర్థ జీవితానికి దుఃఖించాడా? మనకి తెలియదు; అకాకీ మాత్రం చావుబ్రతుకుల కెరటాల వుయ్యాలలో ఒకసారి అటూ ఇటూ వూగుతూ మూలుగుతూ పడుకున్నాడు. బాగా సంధించింది; సంధిలో ఏవేవో అర్థంలేని దృశ్యాలు చూసి పలవరిస్తున్నాడు. కాస్సేపు పెట్రోవిచ్‌తో మాట్లాడేవాడు; కోటు కుట్టిపెట్టమని అడిగేవాడు. మరి కాసేపు 'మంచంకింద దొంగలున్నారర్రోయ్' అని గోలపెట్టేవాడు. దుప్పటికి కింద దొంగలున్నారనీ, లాగి

పారెయ్యమనీ ఇంటి యజమానురాల్ని వేడుకునేవాడు. కాస్సేపు ఆగి, తనకు కొత్తకోటు వుండగా, పాతకోటు వంకెకెందుకు తగిలించారని కోప్పడేవాడు. తరవాత తన యెదురుగా (ఫలానా) పెద్ద మనిషి వున్నట్టు భావించి, ఆయన తిట్టే తిట్లన్నీ విని "క్షమించండి బాబూ" అని ప్రార్థించేవాడు. కాని చివరికి పెదమనిషిని కసితీరా తిట్టసాగాడు. అకాకీ నోటినుండి బూతు లెప్పుడూ విని యెరగని యజమానురాలు భయపడింది. పైగా యెవరో పెద్ద మనిషిని పట్టుకు తిట్టడం యింకా భయం కలిగించింది. తరవాత, అకాకీ బొత్తిగా అర్థంలేని వాగుడు వాగసాగాడు. ఈ వాగుడు సారాంశం ఎంతసేపు చూసినా అతని కోటుగురించే.

ఎలాగైతేనేం అకాకీ అకాకీ యెవిచ్ అంతిమ నిశ్వాసం విడిచాడు. అతని గదికిగాని, సామాన్లకుగాని అధికారులు సీళ్ళు వెయ్యలేదు. మొదటి కారణం అతనికి వారసు లెవరూ లేరు; రెండో కారణం వారసులకు భద్రంగా అప్పగించదగినంత ఆస్తి లేదు. ఉన్నవల్లా కొన్ని ఈక కలాలు, దస్తా తెల్లకాగితాలు, మూడు జతల మేజోళ్లు, రెండు మూడు, వూడిపోయిన పంట్లాంబొత్తాలు "తుండుగుడ్డ" అనబడే పాతకోటు, యింతే. ఈ ఆస్తి చివరికి ఎవరికి సంక్రమించిందో దేవుడికూడా తెలియదు. ఈ కథంతా నాతో చెప్పిన వ్యక్తి అకాకీ ఆస్తినిగూర్చి పెద్ద ఆసక్తి చూపలేదు. అకాకీ శవం బయటకు తీసుకుపోబడడం, పాతిపెట్టబడడం మాత్రం సజావుగా జరిగిపోయింది.

అకాకీ పుట్టి పెరిగిన సెంట్ పీటర్స్‌బర్గ్ నగరం అసలటువంటి ప్రాణి వెరగనట్లే వ్యవహరిస్తోంది. ఎవరివల్లా రక్షణపొందని, యెవరిచేతా ప్రేమించబడని, యెవరికీ ఆసక్తి కలిగించని వొక జీవి, చేతికి యీగ అందినా విడవకుండా సూదితో గుచ్చిపట్టుకుని మైక్రోస్కోపు కిందపెట్టి పరీక్షించే మనస్తత్వంకల మానవ స్వభావ పరిశోధకులకు కూడా కించిత్కౌతుకం కలిగించలేకపోయిన వొక అభాగ్యుడు భూగోళపటంనుంచి మాయమైపోయాడు. అధికారుల అవహేళన తప్ప మరొకటి యెరగడు. జీవితంలో ఏ అసాధారణ కార్యమూ తలపెట్టి కూడా యెరగడు. అవసాన సమయంలో కొత్తకోటు అనే దివ్యజ్యోతి అతని జీవితపుటిరుకుదారులలోకి దిగివచ్చి క్షణకాలం మెరిసి, క్షణికానందం కలిగించి అంతర్థానమైంది. ఆ పిమ్మట మళ్ళీ గాఢాంధకారం ఆవరించింది. ప్రపంచ మూర్ధన్యులైనవారి మూర్ధాలకే అర్హమైన అశనికిరీటం అతని శిరస్సు నలంకరించింది.

అతడు మరణించిన చాల రోజులకు, ఆఫీసునుంచి ఒక బంట్రోతు వచ్చాడు. తక్షణం ఆఫీసుకు హాజరు కావలసిందని ముఖ్యాధికారి ఆజ్ఞాపించాడు. కాని బంట్రోతు వచ్చినదారే తిరిగి వెళ్ళి అకాకీ అకాకియెవిచ్ ఇక రాడని విన్నవించాడు. ముఖ్యాధికారి "ఎందుకు రాడు?" అని గద్దించి అడగగా, "చచ్చిపోయాడు; నాలుగురోజులకిందటే పాతిపెట్టారు," అని బంట్రోతు సమాధాన మిచ్చాడు. ఈరీతిగా ఆఫీసులోనివారు అకాకీ మరణవార్త విన్నారు. రెండోరోజున అకాకీ స్థానంలోకి కొత్త ఉద్యోగి వచ్చాడు. ఉన్న ఒక్క తేడా ఏమిటంటే అకాకీ గుండ్రటి అక్షరాలు వ్రాస్తే యీ కొత్త గుమాస్తా కొంచెం కోలగా వ్రాస్తాడు.

కాని అకాకీ ఇంతటితో అంతమొందలేదనీ, తన వ్యర్థజీవితంమీద పగ సాధించడానికిగాను, మరణానంతరం గొప్పసంక్షోభానికి కారకుడయ్యాడని ఎవరుఊహించారు? కాని నిజంగా జరిగింది అదే; దీంతో మన కథకి అనుకోకుండా అపూర్వమైన, అద్భుతమైన ముగింపు ఏర్పడుతోంది.

కాలింకిన్ వంతెనమీదనూ, దాని సమీపంలోను ఏదో దెయ్యం తిరుగుతోందని హఠాత్తుగా సెంట్ పీటర్స్‌బర్గ్‌లో వదంతి పుట్టింది. ఈ దెయ్యం ఒక ఉద్యోగివలె వుంటుందనీ, ఆ ఉద్యోగి పోయిన తన కోటుకోసం వెదుకుతూ వుంటాడనీ, ఆదారిన ఏమనిషి వెడుతున్నా సరే, పెద్దా, చిన్నా, గొప్పా, తక్కువ భేదం లేకుండా ఆపి, కోటులాగి, తనదో కాదో తేల్చుకుని వదిలిపెడుతూవుంటాడని, అది పిల్లి, నక్క, ఎలుగుబంటి-దేనిచర్మంతో కుట్టినదైనాసరే, ఎంత ఖరీదుగలదైనా సరే తనదవునో కాదో పరీక్షించి చూస్తాడనీ పుకారు పాకింది. ఆఫీసు ఉద్యోగుల్లో వొక డొకరోజున దెయ్యాన్ని చూసి, వెంటనే అది అకాకీ అకాకీ యెవిచ్ అని గుర్తుపట్టాడు. గుర్తుపట్టగానే భయం ముంచుకొచ్చి, పిక్కబలం చూపించాడు. అందుచేత అతడు అకాకీని దగ్గిర్నుంచి చూసే అవకాశం కలగలేదుకాని, అకాకీ తన్ను దూరంనుంచే చూపుడువ్రేలు వూపి బెదిరించినట్లు గ్రహించాడు. ఈవిధంగా అన్ని వేపులనుంచీ పోలీసులకు ఫిర్యాదులు చేరాయి. మామూలు గుమాస్తాలేకాక ఇంకా పెద్ద అధికారులు సైతం, దెయ్యం లాగుతూండడంమూలంగా తమ వీపులు, భుజాలు చలిబాధకి లోనవుతున్నాయని అభియోగం మోపారు.

పోలీసులు దెయ్యాన్ని సజీవంగాగాని, నిర్జీవంగాగాని పట్టుకునితీరాలనీ, ఇంకెవరూ యిట్లాంటి పనులు చెయ్యకుండా గట్టిగా శిక్షించాలనీ నిశ్చయించారు. అందుకు తగిన యేర్పాట్లుకూడా జరిగాయి. ఒకసారి దెయ్యాన్ని దాదాపు పట్టేసుకున్నంతపని జరిగినట్లు అనిపించింది. ఒక కాపలావాడు కిరిన్‌ష్కిన్ వీథిలో గస్తీ తిరుగుతూండగా దెయ్యం కనిపించింది. ఎవడో మాజీ సంగీతాధ్యాపకుడు ఆదారిన పోతుంటే దెయ్యం అతన్ని పట్టుకు లాగబోయింది. ఆ దేసమయంలో కాపలా మనిషి జరిమీద పామును పట్టుకున్నట్టు దెయ్యాన్ని పట్టేసుకున్నాడు. పట్టుకుని, తనతోటి పహరావాళ్లను కేకేశాడు. వాళ్ళు పరుగెత్తుకునివచ్చాక, దెయ్యాన్ని గట్టిగా పట్టుకోమని వాళ్లతో చెప్పి, తను బంధించుకుపోయిన ముక్కుల్ని విడుదల చేసేందుకు ముక్కు పొడుం పీల్దామనుకున్నాడు. ముక్కు పొడుం పొట్లం బూటులో వున్నందున, వంగుని బైటికి తీశాడు. చిటికెడు పొడుంతీసి కుడిముక్కు మూసి ఎడమ ముక్కులోకి దట్టిస్తున్నాడు. నశ్యంఘాటుకు దెయ్యంకూడా తాళలేకపోయింది. "హాచ్!" మని పిడుగులాంటితుమ్ము, దెయ్యాలతుమ్మై వుండాలి, తుమ్మింది. తుమ్ము ఫలితంగా తుఫానుజల్లువంటి తుంపుర్లు పహరావాళ్ల ముగ్గురి మొహాల్లోను కొట్టడం, వాళ్ల కళ్లు మూసుకుపోయి దెయ్యాన్ని విడిచిపెట్టడం, దెయ్యం అంతర్థానం కావడం అంతా ఒక్కసారే జరిగింది. కళ్ళు తెరిచేసరికి ఏమీ లేదు. అసలు దెయ్యాన్ని పట్టుకున్నారో లేదో కూడా అనుమానించవలసినంత అద్భుతంగా యిదంతా జరిగిపోయింది. అప్పటినుంచీ, పహరావాళ్లకి చచ్చిపోయిన మనుషులంటే యెంత భయం కలిగిందంటే, బ్రతికివున్న మనుషుల్నయినా సరే, పట్టుకోవడానికి భయపడేవారు. దూరంనుంచే "ఏయ్, ఎవరక్కడ? నీదార్న నువ్వుపో," అని కేక లేసేవారు. దీని ఫలితంగా అకాకీ దెయ్యం కాలింకిన్ వంతెనకు దూరంగా వున్న

# రచయితలకు మనవి

**మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.**

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్‌పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫొటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫొటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం. ఫొటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

మాకు పంపిన రచనలను, ఫొటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

# ★ శని దేవత రథచక్రం ★

ప్రాంతాలకు కూడా పోయి, పిరికివాళ్లని కాపలగొట్టడం సాగించింది.

అయితే, యీ యథార్థ చరిత్ర యిలా అద్భుత పరివర్తనం చెందడానికి కారణభూతుడైన పెద్దమనిషిని మనం మరిచిపోయాం. నిజం దాచకూడదు గనుక, ఒక విషయం చెప్పి తీరాలి. అకాకీ అవతలకి వెళ్ళిపోయినతర్వాత పెద్దమనిషి నిజంగా బాధపడ్డాడు. అధికారికంగా అతడు కఠినంగా ప్రవర్తించినా, హృదయం పూర్తిగా మార్దవం కోల్పోయిన బాపతని చెప్పడానికి వీల్లేదు. అందుచేత చిన్ననాటి మిత్రుడు సెలవు పుచ్చుకుని వెళ్ళిపోగానే అకాకీని గూర్చి ఆలోచించాడు. ఆ రోజునుంచీ అకాకీ అతని మనస్సును కలవరపెడుతూనే వున్నాడు. ఈ ఆందోళన భరించలేక ఒక వారం పోయినతర్వాత, అతడు వార్తాహరుణ్ణి అకాకీ యింటికి పంపించి, తనవల్ల సహాయమేమైనా కావాలేమో అడిగి రమ్మన్నాడు. అకాకీ జ్వరగ్రస్తుడై అకస్మాత్తుగా మరణించాడని వినగానే ఉలిక్కిపడ్డాడు. ఆ రోజంతా మనస్థిమితం లేక ఆందోళితుడై సంభ్రమించాడు.

ఊరికే కూర్చుంటే తోచదని, ఆసాయంత్రం ఒక స్నేహితుడింటికి బయల్దేరాడు. స్నేహితుడి యింటనిండా చాలమంది సమావేశమై వున్నారు. అంతా తనతో సమాన హోదావారే. అందువల్ల వారితో సంభాషించడానికి, వారి ఛలోక్తులలో పాల్గొనడానికి సందేహించనక్కర్లేక పోయింది. కులాసాగా నవ్వుతూ, తుళ్లుతూ హృదయం విప్పి మాట్లాడడంవల్ల మనస్సు తేలికపడింది; ఆందోళన మరుగు పడింది. మనిషి వికసించాడు. సాయంత్రమంతా యిలా వినోదించాడు. రాత్రి భోజనానంతరం రెండు గ్లాసులు షాంపేన్ త్రాగాడు. సంతోషం పురికొల్పడంలో షాంపేన్ దేనికీ తీసిపోదని అంతా ఎరిగినదే. మధుర మదిరామత్తుడైన పెద్దమనిషి యేవో సాహస కార్యాలు చేస్తేగాని ఇంటికి తిరిగిపోగూడదని నిశ్చయించుకున్నాడు. ఎక్కడికి పోదామా అనుకున్నాడు. అతనికి ఒకానొక మర్యాదస్తురాలైన జర్మన్ స్త్రీతో పరిచయం వున్నది. ఆమె పేరు కెరొలినా ఇవానోవ్నా. ఆమెకీ, పెద్దమనిషికీ స్నేహసంబంధంవున్నది. ఆమె వద్దకు పోవడానికి నిశ్చయించుకున్నాడు.

మన పెద్దమనిషి వయస్సులో చిన్నమనిషి కాదనే విషయం పాఠకులు గ్రహిస్తారనుకుంటాను. భార్య, బిడ్డలు వున్నారు. కొడుకు లిద్దరిలో పెద్దవాడు అప్పుడే ఏదో ఉద్యోగం కూడా చేస్తున్నాడు. ఆడపిల్ల పదహారేళ్లయీడుది; అందమైనపిల్ల; ముక్కు కొంచెం వంకరగా వున్నా ముద్దొస్తూ వుంటుంది. ఈ ముగ్గురూ పొద్దున్నే తండ్రివద్దకువచ్చి చెయ్యి ముద్దుపెట్టుకుని "గుడ్ మార్నింగ్ పపా" అంటారు. అతని భార్య ఇంకా యౌవనవతి, రూపసి వలెనే కనిపిస్తుంది. ఆమె ముందు తన చేతిని ముద్దుపెట్టుకోనిచ్చి, తరవాత అతని చెయ్యి ముద్దు పెట్టుకుంటుంది. కుటుంబవ్యవహారాలు యింత సంతృప్తికరంగా, సంతోషదాయకంగావున్నా పెద్దమనిషి నగరంలో వేరొకచోట స్నేహితురాల్ని కలిగి వుండడం తన హోదాకు తగిన పని అని భావిస్తాడు. ఈ స్నేహితురాలు అతని భార్యకంటె చిన్నదీకాదు, రూపవతీకాదు. అయినా ఆమెతో అతడెందుకు స్నేహం చేస్తున్నాడూ అంటే సమాధానం చెప్పలేము. ప్రపంచంలో కొన్నికొన్ని సమస్యలు యిలాగే అర్థంలేనివి వుంటాయి. పెద్దమనిషి గుమ్మం దిగి తన స్లెడ్జిబండి ఎక్కి డ్రైవరును "కెరొలినా ఇవానోవ్నా యింటికి పోనియ్యి", అని ఆజ్ఞాపించాడు. వెచ్చటి కోటులో హాయిగా ముసుచుకుని కూర్చున్నాడు. మనస్సు చాలా ఉత్సాహంగా, ప్రశాంతంగా వుంది. అతడు తనంతట తను ఆలోచించడానికి ప్రయత్నించకపోయినా, ఆలోచనలు వాటంతట అవి వస్తున్నాయి, పోతున్నాయి. ఆలోచనలుకూడా ఎంతో కులాసా కలిగిస్తూ మనస్సును జోకొడుతున్నాయి. ఇటువంటి మానసికస్థితి ప్రతి రష్యన్‌కీ ఉల్లాసం కలిగిస్తుంది; ఇంతకంటె మంచిమానసికస్థితివుంటుందంటే ఏరష్యనూ నమ్మడు. పెద్దమనిషి ఆ సాయంత్రం మిత్రుడి గృహంలో జరిగిన వినోదక సమంతా జ్ఞాపకం తెచ్చుకున్నాడు ఏయే ఛలోక్తులకు సభికులంతా పగలబడినవ్వారో అవన్నీ జ్ఞాపకం తెచ్చుకున్నాడు. కొన్ని ఛలోక్తులను మళ్లీ బిగ్గరగా అనుకుని, మళ్ళీ నవ్వుకున్నాడు. కాని ఉండివుండి ఎక్కణ్ణించి వస్తుందో, ఎందుకొస్తుందో తెలియకుండా చలిగాలివీచి అతని ముఖాన్ని కరిచికరిచిపోయేది. ముఖంనిండా మంచు కొట్టుకుని కోటు కాలరు తడిపి వేసేది. గాలికి కోటు కాలరు అతని ముఖానికి రెపరెప కొట్టుకునేది. అందుచేత ప్రయాణం అంత సుఖంగా లేదని అనుకోసాగాడు

హఠాత్తుగా పెద్దమనిషికి ఎవరో వెనక నుంచి కాలరు గుంజినట్లయింది. వెనక్కి చూశాడు. పొట్టిమనిషి ఎవడో చిరిగిన పాతకోటు తొడుక్కున్నవాడు అక్కడ నుంచునివున్నాడు. ఆమనిషి అకాకీ అకాకి యెవిచ్ అని గుర్తుపట్టడం, పెద్దమనిషి భయ విహ్వలుడై బిగుసుకుపోవడం ఒక్కసారే జరిగింది. అకాకీ ముఖం మంచుకంటె తెల్లగా, శవంకంటె వికృతంగా వుంది. అకాకీ నోరు తెరిచాడు. పెద్దమనిషి భయం వర్ణనాతీతమైంది. శ్మశానపు అలౌకిక వాసన వెదజల్లుతూ అకాకీ యిలా మాట్లాడ సాగాడు: "ఆ. నువ్వు దొరికావా యిన్నాళ్లకి? ఇప్పుడెక్కడికి పోతావ్? నీ కాలరు నా చేతులో వుంది. నీకోటు కావాలి నాకు. నాకోటుగురించి నువ్వు బాధపడలేదు. పైగా నన్ను నిర్దయగా తిట్టావు. సరే, నీకోటు యిచ్చెయ్యి, నాకు అవసరం."

ఈహఠాత్సంఘటనకు నిశ్చేష్టుడయ్యాడు పెద్దమనిషి. ఆఫీసులోను, ఇతరత్రాను, ముఖ్యంగా కింది తరగతి ఉద్యోగులవద్దనూ ఎంతో ధైర్యంగా వుండే మనిషే. అతని దీర్ఘ గంభీర కాయం చూసి ప్రతివాడూ "ఆహా, ఏం మనిషోయ్," అని మెచ్చుకునే వాడే. అయితేనేం యీ అవాంతర సమయంలో మాత్రం అతని గాంభీర్యం పటాపంచలైంది. బైటికి గంభీరంగా కనిపించే అందరిలాగానే. అతడుకూడా, యీ అలౌకికాకారం సన్నిధిలో చెప్పలేని భయం అనుభవించాడు. గబగబా కోటువిప్పి పారేశాడు. చంటిపిల్లడు కేక వేసినట్లు "ఇంటికి పోనియ్, త్వరగా," అని డ్రైవరుకు అజ్ఞాపించాడు. యజమాని కంఠం భయభ్రాంతంగా వుండడం, తన్నుకూడా యేదో స్పృశించినట్లు అనిపించడం చూసి డ్రైవరు కూడా భయపడి కమ్చీ ఝుళిపించి బండిని బాణంలాగా పోనిచ్చాడు. ఆరునిమిషాలు దాటకుండా పెద్దమనిషి తన యింటికి వచ్చేశాడు. పాలిపోయి, భయంతో గజగజ వణుకుతూ, కోటు లేకుండా పెద్దమనిషి యింటికి వచ్చేశాడు, తన స్నేహితురాలింటికి వెళ్లడానికి బదులు ఎలాగో తూలుతూనే తన గదిలోకివెళ్ళి ఆరాత్రంతా అతి దుర్భరంగా గడిపాడు. మర్నాడుదయం టీ తెచ్చిన కుమార్తె తండ్రిని చూసి "అలా వున్నావేంనాన్నా?"అని అడిగింది. కాని నాన్న మాట్లాడకుండా కూర్చున్నాడు. తనకు జరిగిన అనుభవాన్ని గూర్చి ఎవ్వరితోనూ ఒక్కమాటైనా చెప్పలేదు.

ఈ అనుభవం అతనిమీద అమోఘంగా పనిచేసింది. కింది ఉద్యోగులతో "ఏం కావెక్కిందా? నీ యెదట నుంచున్న దెవరో తెలుసా?" అని అనడం తగ్గించాడు. ఎప్పుడైనా అన్నా, సంగతి సందర్భాలు విచారించి అవసర మనిపిస్తేనే అనేవాడు. కాని యింతకంటే గొప్ప దూర్పమిటంటే, ఆరోజునుంచే అకాకిదెయ్యం భూలోకంలో కనిపించడం మానేసింది. బహుశా పెద్దమనిషి కోటు అకాకీకి సరిగ్గా సరిపోయి వుంటుంది. ఏదెలాగున్నా.

(56-వ పేజీ చూడండి)

# మూడో కోడలు

**రమణశ్రీ**

ఆ సుముహూర్తపు ఘడియల్లో నే, అతీతమయిన సౌందర్యగర్వంతో మూడో కోడలు ఇంట్లో అడుగు పెట్టబోతోంది. అడుగులు తడబడకుండా నిశ్చలమైనధీమాతో ఏపాదం ముందు పెట్టాలో తికమకపడుతూ, కుడి యెడమల తేడాలు తెలీక, ఎడమపాదం పెట్టి ఆ యింటికి మహాపచారం చేసింది. అత్తగారూ, తనతల్లీ, పెదతల్లీ, అక్కలూ, అన్నలూ తనకున్న బంధువర్గం యావత్తూ ప్రళయం పెల్లుబికి వెల్లువలై వచ్చినట్టు, "కుడి, కాలు, కుడికాలు" అని కేకలేశారు.

"కుడికాలు పెట్టమ్మాయ్! ఎన్నిసార్లు చెప్పినా బుద్ధి లేకుండా పోతోందేం?" అని అత్తగారు ప్రథమ శాసనం చేసి, మూడో కోడలిమీద ప్రయోగం చేశారు. అందరి ముఖాల్లో కళకళలూ... ఫెళఫెళలూ... అంతా మూడో కోడలిపై పేముఖాలు తిప్పి, "ఈ నిమిషంలో నే, నీ బుద్ధి చలించిపోయిందా అమ్మాయ్? కుడయినా, ఎడమయినా పొరబాటు లేదనుకున్నావా?" అనీ, నిలదీసి సాగదీసి అడిగారు. దాంతో, తన జీవితం అంధకార బంధురమైనట్లనిపించింది. గుడ్లగూబలు, గోతకూతలు కూసే నీరవ వాతావరణం అలుముకొని, వెలుగుని మింగేసిన చీకటి త్రాచులు బుసగొడుతూ, కాటెయ్యా అని భయం వేసింది... మూడో కోడలికి; ... ఆయింటి మూడో కోడలు... ఒక్క చిరునవ్వు పెదవివంపులో... త్రుంచి పారవేస్తూ, "ఏం చెయ్యమంటారూ?... ఏదో పొరబాటు... అంతమాత్రం చేత నా బ్రతుకు బండలైపోదులెండి!" అంది—ఆ అహంకారానికి, గర్వానికి, విన్నవాళ్లంతా స్వగతంలో నిందించుకొన్నారు...

అత్తగారుమాత్రం వూరుకోలేదు. ముఖం ముచ్చటగా చిట్లించుకొంది: "ఏదోనమ్మా! చిన్నపిల్ల... కుడియెడమ తేడాలు తెలీక.. పొరబాటున..."—అంటూ నలుగురూ సర్ది చెప్పబోయారు. ఈమాత్రం దానికే, ఇంత రాద్ధాంతం సిద్ధాంతం చేస్తుందని, అనుకోలేదు.

వీళ్ళందరికీ, ఎడంకాలే మాత్రం ద్రోహం చేసింది? ఎడం పాదంవైపు కుడి పాదంవైపు తీవ్రంగా ఒక్కసారి చూసి, కోడలు నవ్వుకొంది. రెండూ సమాన బలావకాశాలతో, సౌందర్య గర్వంతో తులతూగుతున్నయ్!...

ఏదో వూహించుకొని, ఊరుకొంది... తనింట్లో అడుగు పెడుతున్నప్పుడు... మేడమీద పావురాలు... గుబగుబలాడినయ్!... కోకిలలు కుయ్యలేదు... దూరంలో రావిచెట్టుమీద కూర్చుని, మూడో కోడలి గృహప్రవేశం తమాషా చూస్తున్నయ్!...

పిల్లలంతా అన్నారు... కోకిలలు... కుయ్యడం మానేశాయని...... ఇందాకట్నుంచీ తెగకూసే యని... అంతా అనుకున్నారు, "తీరా సమయానికి, కూత కుయ్యడం మానేశాయే—"...

ఆ రాత్రి—గేదె తన్నేసిందని... కాలీ తపాళా యిచ్చేసి వెళ్ళిపోతుంటే, ఒక్క మొహం వేసుకు చూచింది అత్తగారు. 'అమ్మగారు అడుగు పెట్టడం ... అప్పుడే అనర్థాలన్నీ అగుపడ్డం' అంటూ లోపల్లో పలే గొణుక్కొని ఉంటుంది. మూడో కోడలి విషయం ఇట్టే పసిగట్టేసి వుంటుంది...

చుట్టుపక్కల జనం... తన్ను చూడడానికి బిలబిల్లాడుకుంటూ వస్తున్నారు... మూడోకోడ లొచ్చింది ... మూడోకోడలొచ్చింది... అని. తను, వాళ్లందరికీ నిర్వికారంగా దర్శనమిచ్చింది. అంతా అన్నిరకాల దీవెనలిస్తూ, పొగడ్తల్ని అగడ్తలు దాటిస్తూ, అత్తగారి అదృష్టాన్ని పొగిడారు. "మీ మూడో కోడలెంత అందంగా, బాగుంటుందమ్మా!... కాస్త పలుకు పెడసరం గాని... ఎంత నాజూకు... ఎంత నాజూకు - మంచి గుణం... గుణానికితగ్గ వినయం ... చాలగుటమ్మా! ఇంతకంటే మంచికోడలెక్కడ తేగలరూ?!"

అత్తగారు నసుగుతూ, "రాత్రి గేదె పాలివ్వలేదమ్మా! పాలికాపుని తన్నేసింది" అంది...

"అసలది ఒకప్పుడు పాలిచ్చిందట లే అమ్మా!" అని నలుగురూ సాగదీసి వెళ్ళిపోయారు.

వాళ్లంటూన్న మాటలూ, అత్తగారి సమాధానాలూ, అన్నీ తన తల దిమ్మెక్కించినయ్!... నేడిలాంటి స్తుతులు చేసేవాళ్ళు రేపు నిందలు మోపడానికూడా, వెంటనే సిద్ధపడతారు!... ఇలాంటివాళ్ళందరినీ, ఒక కంటికి దూరంగానే చూస్తుంది తను—తను రావటమేమిటి?... వీళ్ళంతా పరామర్శ చేయడమేమిటి?...... తనకి పూర్తిగా వెగటనిపించింది. తన అందంజోలి వీళ్ళ కెందుకు? ఇద్దరి కోడళ్ళకంటె తనే అందమైందట! తనే గుణవంతురాలట!... ఈ పొగడ్తలన్నింటికీ నిప్పంటించి బూడిద చెయ్యాలనిపిస్తోంది తనకు—వాళ్లకెదురుగ్గా నే, హోరాహోరీ పోరుతూ, "ఈవాళ మీరు పొగుడుతారు... రేపేమైనా తేడా వస్తే, తెగడుతారు. మీవి కాకి బుద్ధులు......" అని, నాలుగు చీవాట్లూ వేసి, "నా గుణం తెలిసిందా?" అనాలనిపించింది. అయినా, వీళ్ళందర్నీ ఓడించి, దెబ్బలాడి విజయశంఖం పూరించగలదా?... ఏమో!...

అత్తగార్ని... పెద్దకోడళ్ళని... తను బాగా ఆకర్షించుకొని, తన చుట్టూ తిరిగేట్టు చేయాలి... అప్పుడు గాని, తనకి సంతృప్తి ఉండదు. తన అందచందాలకీ, లావణ్యానికీ తగిన విలువలుండవు...

మొదటిసారేం, అనేకసార్లు తన భర్తని కలుసుకొన్నప్పుడు నిర్మొహమాటంగా, ఈ ప్రశ్న వేసేది.... ఈ విషయాన్ని గురించే నొక్కినొక్కి పదే, పదే అడిగి విసిగించేది. "నేనెలా వున్నాను? మీ కంటికి నేను నచ్చానా?... నేను అందమైనదాన్నేనా?" అని నట్టిమొట్టిగా, వేళాకోళం గా ప్రశ్నలు వేసేది... దానికి, తగిన సమాధానం పొందేదాక నిద్రపోవడం తన కలవాటు లేదు...

తన కెందుకు గర్వం?... దేన్ని చూచి అహంకారం?......... దేన్ని అనుకొని మిడిసిపాటు?......—పెద్ద కోడళ్ళని చూడబోదామూ అంటే, వాళ్ళు తనని చూచే ఈర్ష్యపడేవారు... అందుకే వాళ్లిద్దరికిద్దరూ అంటే... వాళ్ళపొడే గిట్టేదికాదు ...వాళ్ళ వాసనే తను సహించలేదు .. వాళ్లంటే తన కసహ్యం - వాళ్ళనగా ఎంత?... వాళ్ల లెక్కెంత?... అందులోనూ ఒకామె నలుపు... మిడిగుడ్లు... మరో హావిడకి జుట్టులేదు... నగల్లేవు... బక్క చిక్కిన శరీరం... అస్థిపంజరం ... అందుచేత నే... తను అందమైందని, అవయవపుష్టి కలదనీ... వాళ్ళకి అసూయ...... అసూయాజ్వాలలు వాళ్ళను ఆపాదమస్తకం దహించుకపోయేవి ...తనని చూచి, ఒకావిడ హూంకరించేది

గట్టించేది - గొణుక్కునేది - అయితే, తనేం లెక్కచేయకుండా, ఒక్క నిశ్చలమైనచూపు చూసి, ఏమాత్రం చలించకుండా, జడని వయ్యారంగా తిప్పుకుంటూ వెళ్ళిపోతోంటే, వాళ్ళిద్దరూ తనవెనక ఎన్ని అగాధాలు తవ్వుతున్నారో తనకేం తెలుసు?...అయితే యేం! తన సౌందర్యజ్వాలతో వాళ్ళు నిరంతరం దహించుకపోతున్నారు. వాళ్ళకళ్లలో నిశ్చలమైన మంటలు!... వాళ్ల గుండెల్లో భయంకరమైనఘంటలు!...-తనుసృష్టించుకుంది, తను మ్రోగించుతుంది...

లోలోపల ద్వేషాలు పెంచుకొంటూనే, నానా వేషాలు వేస్తూ కపట ప్రేమలు నటిస్తూ తనతో తక్కుతూ తారుతూ, నవ్వుతూ ప్రేలుతూ మాట్లాడేవారు...తను ముభావంగా సమాధానమిస్తూంటే రెచ్చిపోయి, తనబాసలో యాసనివెక్కిరిస్తూ, "అయ్యేంది మాటలేపిల్లా?" అనేవారు...

రోజూ తను ప్రొద్దుటే, చక్కగాకాఫీ కాచుకొని, ఇడ్లీయో, ఉప్మాయో, పూరీయో తెప్పించుకొని కడుపునిండా తినేది...కాని మితకబారి, నీళ్లుగారుతూ మత్తెక్కించే పొడుచద్దెన్నంవాళ్ళిద్దరిలాగా తనూతినలేకపోవడమే తనఅపరాధమైంది...

తనిష్ట మొచ్చినట్టు, మొగుడికైనా చెప్పకుండా, కావల్సినవన్నీ తెప్పించుకు తింటూంటే, చూసేవాళ్ళ కళ్లకి గారడీ జరుగుతున్నట్టు అనిపించక మరెలా కనిపిస్తుంది?...సాయంకాల మయేసరికి, చామంతి పూలో మల్లెపూలో, కనకాంబరాలో తెప్పించుకొని, పొడుగ్గా బారెడు జడ, అందా లొలికించే మెడమీదనించి, వయ్యారంగా జారుస్తూ, మన్మథుడి కొరడాలా తయారుచేసి, వీధిలోంచి నడుస్తూ వెడుతోంటే చూడని వాళ్ల కళ్లదే పాపం!...ఇవ్వన్నీ చూస్తూ తన భర్త మాత్రం ఏమనగలడు?...అదీగాక, ఏమనక, ఊరుకొన్నాడంటే, తన జీవితం సార్థకమైనట్టు భావించుకోబట్టే!

ఇక నాటినించీ, ఇంట్లో గుజగుజలూ విజవిజలూ విసుక్కోవడాలు, కసుక్కోవడాలూ...క్రింద... ఇద్దరు కోడళ్ళూ,



"కుడికాలు పెట్టమ్మాయ్! నీ కెన్నిసార్లు చెపుతున్నా బుద్ధిలేకుండా పోతోందే?"



# మూడో కోడలు



తంగం సాగించారు. వాళ్ళుమాత్రం తక్కువ వాళ్ళా?...వాళ్ళూ అదే అన్నారు, అత్తగారితో, ... "మేం మాత్రం తక్కువ వాళ్ళమా?...మా మూడో కోడలికంటే మేమూ, ఎక్కువే చదువుకున్నాం?!... ఇంట్లో డబ్బుతీసి, పూలకనీ, పూరీలకనీ, ఖర్చుపెట్టడం మాకూ తెలుసు...ఆమాత్రం మేమూ తెప్పించుకు తింటాం... పోకులూ, షోకుల్లూ మాకూ తెలుసు. ఎలాగైనా, ముందొచ్చిన చెవులకంటే వెనక వచ్చిన కొమ్ములే వాడికెండి!......"— అన్నారు.

చద్దన్నం ఉన్నదున్నట్టుగానే పడితి గొంతులో దిమ్మరించేశారు. "ఇదే మహా యిత్యమమ్మా!...ఎప్పుడూ లేంది!" అని అత్తగారు ఆశ్చర్యపోతూ సణుక్కుంటూ వుంటే, 'ఇళ్ళి మీ ముద్దుల మూడో కోడల్ని అడగమ్మా!' అని సాగదీశారు. ఆసాంతివిని, దద్దమ్మానికీ, అవకాయకీ వ్యక్తిలాచరం చెప్పేసి, కొలలవ సమస్తవిధాలైన టిఫిన్లు తెప్పించుకుని, తినడం సాగించారు నిరంకుశంగా...

మూడో కోడలు ఈ విడ్డూరం చూస్తూ ఊరుకోలేకపోయింది...భర్తమీద విరుచుకుపడుతూ, "ఎలావుత్రా చూస్తున్నారా?... నే ఖర్చుపెట్టేది మా పుట్టింటినించి తెచ్చుకొన్న సొమ్ము!...నాకా మాత్రం అధికారం కూడా లేదా?...అలా సమిష్టి సొమ్ము తగలబెడుతోంటే...చూస్తూ ఊరుకున్నారా?" అని పురికొల్పింది...భర్తకి దిక్కుతోచింది కాదు..తన భార్య చెప్పేదే నిజమయితే, ఈ దురంతాన్ని అరికట్టాలి.. డబ్బుని పూర్తి దక్షతతో కాపాడుకోవాలి

"ఇలాగైతే నాలుగు రోజుల్లో చిప్ప చేతికొస్తుంది..." అంది భార్య...పుట్టింటి డబ్బుతో కొత్త, అజాగ్రత్తగా ఖర్చు పెడుతోంటే, కళ్లు కుట్టిన పెద్దకోడళ్లు... సమిష్టి సొమ్మునే ఖర్చుపెడుతున్నారు. తన కళ్లెదురుగ్గా రోజూ పన్నెండుసార్లు చూస్తూనేవున్నాడు...తన అన్నగార్లు వదినగార్లకి పొట్లాలూ అవీ...అందించటం ...చూస్తూనే వున్నాడు...అందులో తినుబండారాలూ...పువ్వులూ...స్నోలూ... పౌడర్లూ...ఇంకా రకరకాలు...

అందుకే తనభార్య గోలపెడుతోంది... తనూ సమిష్టిలోంచి సొమ్ముతీసి, ఖర్చుపెట్టబోతుంటే ... "తీసింది చాల్లే! ... ఇంక తియ్యకు"...అని గసిరారు అన్నగార్లు.

"నేనేం తియ్యాలేదే" అన్నాడు.

వాళ్ళు పదిసార్లు తీశావన్నారు...ఇతను ఇరవైసార్లు తియ్యలేదన్నాడు ... మాటా మాటా అనుకొని, మాట్లాడ్డం మానుకొన్నారు

.........

మూడోకోడలీ సంభాషణంతా చెవులు రిక్కించివింది ... "నేనే తియ్యలేదు... మా పుట్టింటివాళ్ళసొమ్ము తెచ్చుకొని ఖర్చుపెట్టుకుంటున్నాను ... చేవ వుంటే, మీ ఆడవాళ్ళని ఖర్చుపెట్టి పోషించుకోమనండి"...అని సమాధానం చెప్పుకొంది.

ఈ సమాధానాలు యీగోల ఇంట్లోవాళ్ల చెవుల్ని పూర్తిగా వదలగొట్టింది...నలుగురు నోళ్ళల్లోపడి ఈ విషయం నానవేసినట్టు నానిపోయింది ...అనేకమంది అనేకవిధాలనుకొన్నారు ... మూడోకోడలు ఇంట్లో సమిష్టి డబ్బు దొంగతనం చేసిందనీ....... స్వేచ్ఛగా తినయిష్టంవచ్చినట్టు డబ్బు ఖర్చు

పెట్టుకుంటోందనీ...ఇక కుటుంబం విచ్ఛిత్తయిపోయి విడిపోతారనీ...ఎవరికి వాళ్ళే యమునా తీరే అన్నట్టు, ఎవళ్ళ కుండ వాళ్ళదీ...ఎవరి కంచం వాళ్ళదీ......ఎవరి కూట వాళ్ళదీ అయిపోతుందనీ...

నోటికొచ్చినట్టు అంటూ, మనస్సుకు తోచినట్టు అనుకోసాగారు...

పెద్దకోడళ్ళు ఎవళ్ళకి వాళ్ళు ఇది మా పుట్టింటి సొమ్మే అన్నారు...

ఇలాగే, కయ్యాలూ, కుయ్యాలతో నెల రోజులు గడిచేసరికి బ్రహ్మాండం బద్దలైనట్టనిపించింది...మూడో కోడ లేవిధంగా ఖర్చు చేయకపోయినా, పెద్దకోడళ్ళు మానమన్నా మానలేదు...

ఎలాగూ ఇది విడిపోవడానికే వచ్చిందన్నారు, నలుగురూ..ఈ అభాండమంతా, మూడో కోడలి నెత్తిమీదకే తోసేసేరు... ఇంట్లో అడుగు పెడుతూనే, ఎడం పాదం పెట్టిందనీ...దాని ప్రభావమే, ఇదనీ... విడిపోక తప్పదనీ...ఈ కుటుంబం ఇంత కాలం ఎంత బాగా సాగినా ముందు సాగబోదనీ...అంతా అనుకున్నారు.

ఒక రోజు అన్నగార్లో పెద్దతను, పక్కింటి పెద్దమనిషితో, మూడో కోడలి దుండగాలు వర్ణిస్తూ, డబ్బేలా తగలెడుతున్నదీ వివరించి చిప్ప చేతికి రావడానికి సిద్ధంగా ఉన్నదన్నట్టుగా చెప్పాడు.

ఒకో ఆడదాని కాలిదరిద్రం అలా వుంటుందనీ, ఆవిడ రాకతోనే తమరి ఇంట్లో కలహాలు హెచ్చుపెరిగాయనీ, ఇది వరకెంత ప్రశాంతంగా ఉంటూ ఉన్నదీ ప్రపంచానికి తెలిసిందేననీ...ఈవిధంగా మూడో కోడలు మీద వెయ్యవలసిన అభాండాలూ, నిందలూ మోపి, ఇక విడిపోక తప్పదని ఆ పెద్దమనిషితో అన్నాడు.

"అలాగే ప్రశాంతంగా విడిపోండి" అని సలహా ఇచ్చాడు పెద్దమనిషి...

ఈ సంగతంతా చిన్నతను విన్నాడు. ఇంకేముంది!...పెద్ద గోలగా అరుస్తూ, "దాని సొమ్మది ఖర్చుపెట్టుకుంటే మీ కోర్వలేకపోయారు!...ఎప్పటికన్నా మనవి మూడు బొచ్చెలే!"...అని విడిపోవడానికే సిద్ధపడ్డాడు.

లెక్కలన్నీ తేల్చుకుని, వచ్చిన డబ్బు పంచుకొని, ఆరెకరాల పొలాన్నీ చీలగొట్టి ఇల్లు మూడు భాగాలుగా విభజించుకొన్నారు...అన్నీ సరిహద్దు లేర్పరచుకొని, ఒకళ్ళ భాగంలో మరోవాళ్ళు ఉండడంగాని...సామాన్లు వాడేసుకోవడానికి గాని వీల్లేదనుకొన్నారు.

ఎవళ్ళ వ్యవహారం వాళ్ళది...ఎవళ్ళ ఉద్యోగం వాళ్ళది...వాళ్ళు వీళ్ళతో మాట్లాడరు...వీళ్లు వాళ్లతో మాట్లాడుకోరు..ఒకళ్ల నీళ్ళు ఒకళ్లు ముట్టుకోనన్నా ముట్టుకోరు.

అత్తగారు, కొడుకులు ముగ్గురూ తన కళ్లెదురుగ్గా మూడు బాటల్లో చీలిపోవడం చూచి, కన్నీళ్లు కార్చింది. ఒక కడుపున పుట్టిన బిడ్డలే!...ఒకచోట, ఒకే రక్తాన్ని, ఒకే సంస్కారాన్ని పెంచుకొన్న, పంచుకొన్న వ్యక్తులే!...నేడు విభిన్న దృక్పథాల్లో, వేరయిపోయి, 'నీ వెవరు?...నే నెవరు?'... అన్నంతగా, తమ రక్తబాంధవ్యాన్ని మర్చిపోయి, జీవిస్తున్నారు...

తన కళ్ళముందు, నాటకంలా జరిగిపోతోంటే చూస్తూ ఉండిపోయింది. ఏంచేయగలదు? ఎన్నోవిధాల చెప్పిచూచింది...... ప్రయోజనం లేని చెప్పడం...

ఆ యిల్లు మూడు ముక్కలైపోవడానికి, మూడో కోడలే కారణమన్నారు లోకులు. నిజ మెంతవరకో, ఎవరి కెరుక?...దీనికి సంబంధించిన నిజం, డొక్కనుండి బయటికి రాలేకపోతోంది! దీనంతకీ, ఎడమ పాదమే కారణమా?






## 11

పారిస్‌లో నాటర్ డామ్ చర్చి నేటికీ (రచయిత కాలం నాటికి) అద్భుత శిల్పసృష్టే. కాని ఇంతకాలం స్వీయసౌందర్యం నిలుపుకున్నప్పటికీ, ఈ అపూర్వనిర్మాణం పట్ల కాలమూ మానవుడూ చేసిన అపచారానికి ఖేదం కలగకమానదు. ఫ్రెంచి చక్రవర్తుల ఆధ్వర్యంలోనే నిర్మించబడినప్పటికీ ఈ క్రైస్తవ దేవాలయంపట్ల ఫ్రెంచి దేశస్థులు శిల్పకారులు అంతగా భక్తి గౌరవాలు ప్రదర్శించలేదు. క్రైస్తవ దేవాలయాలన్నిటిలో మేటి అనదగిన ఈ సుందర శిల్పం ముఖాన వార్ధక్య రేఖలతోపాటు అఘాతచిహ్నాలు కూడా అనేకం కానవస్తాయి. కాలం గుడ్డిది ; మానవుడు మూర్ఖుడు.

నాటర్ డామ్ చర్చివంటి మహోన్నత గంభీర నిర్మాణాన్ని, అక్కడి శిల్ప వైభవాన్ని చూసి ఆశ్చర్యపడని వారుండరు. దేవాలయ ప్రాంగణంలో మున్ముందుగా మూడు బహిర్ద్వారాలు కనిపిస్తాయి. ఈ మూడింటి గోడలలో ఫ్రెంచి రాజవంశీయుల మూర్తిశిల్పాలుండేవి. ఆ శిల్పాలిప్పు డేమైనాయో తెలియదు. ఇప్పుడక్కడ శూన్య గహ్వరాలు మాత్రం మిగిలివున్నాయి. మూడు ద్వారాల మధ్యనూ రంగుల అద్దాలమర్చిన మూడేసి కిటికీలు, సన్నని స్తంభాల పైభాగంలో శిల్పవిశేషాలు, మూడు బహిర్ద్వారాల పైనా రెండు గాలిగోపురాలూ ఉన్నాయి. ఇక్కడి ఉదార శిల్పసృష్టి ప్రపంచంలోనే అరుదు. అడుగడుగునా శిల్పవిశేషాలతో బహిః ప్రాంగణం ముచ్చట గొలుపుతుంది. శిల్పాలు లెక్కలేనన్ని ఉన్నప్పటికీ ప్రేక్షకులకు విసుగు పుట్టదు. సమశ్రుతిలో స్వరాలు మేళవించినట్లున్న శిలా శిల్పసంపద ఈ దేవాలయంపై దివ్యగీతం వినిపిస్తున్నట్లుంటుంది. శిల్పకారుల అపార పరిశ్రమ శిల్పకళతో మేళవించి, ప్రతి శిలాఖండానికీ ఒక విశిష్టత చేకూర్చింది. ఈశిల్పసృష్టి ఈశ్వర సృష్టిలా పరాకాష్ఠ అందుకుంది. కాని ఆధునిక శిల్పకారుల జోక్యంవల్ల సమశ్రుతి చెడి కళాపిపాసువులకిప్పుడు కొంత మనోవ్యధ కలిగిస్తుంది. బహిఃప్రాంగణానికెట్టి అపచారం జరిగిందో, మొత్తంమీద దేవాలయానికంతటికీ అదే అపచారం జరిగింది; మధ్యయుగానికి చెందిన క్రైస్తవ శిల్పానికీ, దేవాలయాలకూ అదే అపచారం జరిగింది. పారిస్ నగరం విస్తరిస్తూనే క్రమంగా నేలమట్టం పెంచుకుంటూ వచ్చింది. దేవాలయప్రవేశానికేర్పాటయిన పదకొండు సోపానాలు కాలక్రమేణా ఒక్కొటొక్కటిగా నేలమట్టంలో కలిసిపోయాయి; తరువాత దిగువశిల్పాలుమాయమైనాయి. కాలప్రభావంవల్లనే సోపానాలు అంతరించి ఉండవచ్చును. కాని కాలకృతమైన అపచారం తక్కువే. పైగా కాలం దేవాలయానికి ఒక పురాతన శోభ కూడా ప్రసాదించింది. కాని మానవులు చేసిన అపచారం మాత్రం అత్యధికం. శిల్పాలు తొలగించడంతో వారు తృప్తిపడలేదు. మధ్యయుగ శిల్పానికి చెందిన ఈ కట్టడంలో ఆధునిక శిల్పాలు అతికించి కొన్ని వికృతమైన మార్పులు చేశారు. కళా కాంతీ లేని దారు కవాటం ఒకటి సింహద్వారానికి తగిలించారు.

ప్రాంగణం దాటి దేవాలయంలో ప్రవేశిస్తే ఎత్తైన ఒక శిలాప్రతిమ కనపడేది. అది ఇప్పుడక్కడలేదు. మందిరంలో ప్రతి స్తంభంపైనా, కుడ్యాలలోనూ నిర్మించబడిన శిలాకృతులు లేవు. గోథిక్ శిల్ప విశిష్టత ఉట్టిపడే ప్రార్థనా వేదికమీద ఎవరో కుప్పతిప్పలుగా ఆధునిక శిల్పాలు మలిచారు. గోడల పై గవాక్షాలలో రంగురంగుల అద్దాలకు బదులు రంగు

మూలం :
విక్టర్ హ్యూగో

అనువాదం :
సూరంపూడి సీతారామ్

## ఒరియా మహిళ

ఒరిస్సా చరిత్రలో అపూర్వశిల్పకళాసంపద చిరస్మరణీయ మైనది. వట్టి రాళ్ల బండలనుండి అద్భుతశిల్పకళలతో రాణించు దేవాలయాలు ఒరిస్సా ప్రతిబను ప్రపంచమంతటా చాటుతున్నవి ఆ రాష్ట్రంలో ప్రతిసంఘానికి ఇప్పటికి తమ ప్రాచీన దేవాలయాలున్నాయి. వీటిలో అన్నిటికన్న అధికంగా గౌరవప్రఖ్యాతులు గాంచినది నిస్పందేహంగా పూరీలోని-జగత్తుకు నాథుడు జగన్నాథుని దేవాలయమే. ఉత్తరాన 20 మైళ్ల దూరంలో నల్లని కోణార్క దేవాలయం కలదు. దానిలో బ్రహ్మాండమైన సింహములు, ఏనుగులు, విగ్రహాలు, సింహాసనాలు, యుద్ధరంగ దృశ్యాలు, దాడి దృశ్యాలు చెక్కబడి వున్నవి. ఒరిస్సా ప్రజలు వారి జీవితంలో పరిపాలనా సంబంధమైన సంక్షోభాలనూ చవి చూచారు; వర్షాభావ, క్షామ పరిస్థితులను కూడా ఎదుర్కొన్నారు. అయినప్పటికీ, వారు నిశ్చల భక్తి విశ్వాసాలతో తమతమ మతసంప్రదాయాలకు బద్ధులై, నిరాడంబర జీవులుగా ప్రశాంతులుగా, వినయ విధేయతగల జాతిగా ఉన్నారు.

ఇండియాలో మారుమూలలోను నివసించెడి వివిధ వర్గాలతో నిరంతర సన్నిహిత సంబంధాన్ని మేము ఏర్పరుచుకున్నాము. వారు తమకు కావలసిన పెట్రోలియం ప్రొడకులక్కు మాపై ఆధారపడుతున్నారు గనుక మేము కూడా వారికి సేవచేయడము గొప్పగా భావిస్తున్నాము.



**బర్మా-షెల్...**
**భారత జీవితంలో ముఖ్య భాగమై యున్నది**

BSY.727-TEL

#  ఘంటారావం 

లేని 'తెల్ల' అద్దా లమర్చారు. పైగోడలకు పసుపు పచ్చనిరంగు పూసి వర్ణసమ్మేళనం భగ్నపరిచారు. నేటి క్రైస్తవ మతాధికారులకు పసుపుపచ్చని పూతలపట్ల ఇంత మోజెందుకు పుట్టిందో తెలియదు. పూర్వం హంతకుల గృహాలపై ఈ రంగుపూసేవారు! ఇంతేకాదు. ఎత్తైన గాలిగోపురం పడగొట్టి, పైన మూత బోర్లించినట్లు ఒక అర్ధచంద్రాకారపు లోహఖండం అమర్చారు.

మధ్యయుగ శిల్పానికి ప్రతిదేశంలోనూ ఇదేవిధంగా అపచారం జరిగింది. దీనికి కాలమే కాదు; రాజకీయ విప్లవాలు, మతకల్లోలాలుకూడా కారణాలే. విప్లవావేశంలో మానవులు మంచిచెడ్డల మాట తలపెట్టరు. రాజులకు మతాధికారులకు సంబంధించని శిల్పాలు కూడా నిలువలేదు. ఇంక ఆధునిక కళాకారులమాట చెప్పనక్కరలేదు. కాలమూ విప్లవాలూ కొంత నిష్పక్షపాతబుద్ధితోనైనా ప్రవర్తించాయి; కాని ఆధునిక శిల్పులు కేవల పక్షపాతబుద్ధితో గోథిక్ శిల్పానికి అన్నివిధాలా భ్రష్టస్వరూపం కల్పించారు. (ఫ్రాన్సులో 12 వ శతాబ్దంలో ఆరంభమై వ్యాపించి 16 వ శతాబ్దంలో అంతరించింది గోథిక్ శిల్పం. దీనినే మధ్యయుగాల అనాగరిక శిల్పం అని అధిక్షేపించేవారు కూడా.)

నాటర్‌డామ్ చర్చి ఏ ఒక్క విశిష్టకళా విధానానికీ చెందినది కాదు. అన్ని కాలాలకూ చెందిన శిల్పాలు అక్కడ గోచరిస్తాయి. అది రోమన్ చర్చి కాదు; గోథిక్ చర్చి కాదు, ఆధునికమూ కాదు, పురాతనమూ కాదు. అది సంధియుగపునిర్మాణం. దేవాలయ నిర్మాణ ప్రారంభంలో శాక్సన్లు మొట్టమొదటి స్తంభాలు నిర్మించారు. తరువాత మత యుద్ధాల అనంతరం గోథిక్ శిల్ప ప్రభావం కనపడుతుంది. అయితే ఇది కూడా పూర్తిగా నిలవలేదు. అందువల్లనే నాటర్‌డామ్ చర్చి నిర్మాణంలో పాశ్చాత్య శిల్పకళాపరిణామచరిత్ర స్పష్టంగా గోచరిస్తుంది. శ్రద్ధగా పరికించేవారికి ఫ్రాన్స దేశచరిత్ర, శిల్పచరిత్ర సక్రమానుక్రమణికలో గోచరిస్తాయి.

ఈజిప్టులో పిరమిడ్స్, భారత దేవాలయాలు, యూరప్‌లోని ప్రసిద్ధ క్రైస్తవ మందిరాలు ఏ ఒక్క శిల్పీ నిర్మించినవి కావు. అవి జాతీయ కళాసంపదకు దర్పణాలు. తరతరాల కళాసంపదను సమన్వయించి తీర్చిదిద్దిన సంపుటా లివి. కళా పరిణామంలో కూడా సహజ పరిణామధర్మమే వర్తిస్తుంది. మొదట రోమన్ కళా విశిష్టత, తరువాత గోథిక్ శిల్పవిధానం, ఆపైన గ్రీక్—రోమన్ మిశ్రమవిధానం ఒకదానివెంట ఒకటి ఈ మందిరాలలో వ్యక్తమౌతాయి. వీని నిర్మాణం శతాబ్దాలకొద్దీ సాగడమే ఇందుకు కారణం. (అయితే ఒక్కొక్క శిల్పవిధానానికి చెందిన మందిరాలూ లేకపోలేవు.) ఈరీతిగా యూరప్‌లో ప్రసిద్ధ మందిరాల నిర్మాణం ఆరు శతాబ్దాలపాటు నిరాఘాటంగా కొనసాగింది. ఇటువంటి మందిరాలలో పారిస్‌లోని నాటర్‌డామ్ చర్చి ఒకటి. ఇంతమాత్రాన ఇవి దైవప్రార్థన కనుకూలం కావనుకోకూడదు. లోపలి మందిరాల విభాగం ప్రార్థనా వేదికల ఏర్పాటు మొదలైనవి అన్నిటా ఒకేరీతిగా ఉంటాయి. వృక్షకాండా లొకే తీరున ఉన్నప్పటికీ శాఖోపశాఖలు, పత్ర పుష్ప ఫలసముదాయాలు వేర్వేరు తీరులైనట్లు, దైవమందిరాల ఏర్పాటు ఒక తీరునే ఉండి, పై పైభాగాలు కళావైవిధ్యమూ, రీతివైవిధ్యమూ వెల్లడిస్తాయి. ఇది పదిహేనో శతాబ్దంనాటి నాటర్‌డామ్ చర్చిని గురించిన చరిత్ర. ఇంక పారిస్ నగరం ఎలా ఉండేది?

గోపురా లెక్కి పారిస్ నగరాన్ని చూస్తే ఒక అద్భుత దృశ్యం కనపడుతుంది. సీన్ నది మధ్యలో ఉయ్యాల ఆకారంలో ఉన్న ఒక చిన్న ద్వీపంలో ప్రారంభమైంది పారిస్ నగర చరిత్ర. ఇప్పుడా ద్వీపభాగాన్ని సిటీ అంటున్నారు.

ప్రారంభదశలో సీన్ నదీ జలాలే పారిస్ నగరానికి పరిహద్దులు. చిరకాలం ఈ ద్వీపంలోనే సుప్తావస్థలో గడిపింది పారిస్. ద్వీపాని కిరువైపులా నదిపై రెండే వంతెన లుండేవి. నగరంలోకి ఈ వంతెనలమీదనించే ప్రవేశం. ఈ వంతెనలే శత్రువుల దాడినుంచి నగరాన్ని కాపాడ్డానికి పెట్టని గోడలుగా ఉండేవి.

కాలక్రమేణా జనసంఖ్య పెరగ నారంభించింది. ద్వీపం ఇరుకై కదలడానికి చోటులేక పారిస్ ఇంక నదిదాటింది. ఇప్పుడు వంతెనల కవతల గృహరక్షణకోసం ప్రాకారాలు గోపురాలు వెలిశాయి. (వీని శిథిలాలు పద్దెనిమిదో శతాబ్దంవరకూ కనపడేవి. తరువాత అవీ అంతరించిపోయాయి.)

జనావాసయోగ్యమైన ఈ ప్రదేశం ఇంకా విజృంభించ నారంభించింది. వందలకొద్దీ కొత్త గృహాలు లేచాయి. చివరికి స్థలం చాలక ప్రాకారం దాటి విస్తరించాయి. ఫిలిప్ ఆగస్టస్ కొత్తదుర్గాలు నిర్మింపచేశాడు. పారిస్ నగరాన్ని ఆ వలయ పరిమితిలో నిర్బంధించడానికి ప్రయత్నించాడు. దగ్గరదగ్గరలోనే ఇళ్లు లేచాయి. చోటు చాలక అంతస్థు లెక్కి ఆకాశాని కెగబ్రాకడం మొదలుపెట్టాయి. ఒకదానిని మించి మరొకటి ఉవ్వెత్తుగా పైకి పెరిగాయి. వీధులు సన్నవై చీకటికోణా లయినాయి. అయినా చాలలేదు. ఇంక నిగ్రహించలేక ఫిలిప్ ఆగస్టస్ కోటగోడలుదూకి విస్తరించాయి. కారాగారపు గోడలు దూకి విడివడిన బందీలవలె కోటగోడల కవతల జనావాసాలు యథేచ్ఛగా విస్తరించాయి. ఈమారు తోటలూ, దొడ్లు అమర్చుకుని సుఖావాసాలయినాయి. తిరిగి 1367 వ సంవత్సరానికి కొత్త పరిధు లవసరమైనాయి. తిరిగి అయిదో చార్లెస్ కొత్తగా గిరిగీశాడు. కాని ఈ గిరి దాటడానికి పారిస్‌కి ఆట్టే కాలం పట్టలేదు. ఇంక పారిస్ మరింత వేగంతో విజృంభించ నారంభించింది.

ఇటువంటివే దేశాలకు రాజధానులు కాగలిగిన నగరాలు. ఆ దేశంలోని రాజకీయ, సాంఘిక, నైతిక వైజ్ఞానిక వాహినులు ఇట్టువంటి నెలవుకే చేరగలవు. అయితే వీనిలో కొత్త నీటితోపాటు పాత నీరుకూడా చేరడం మానదు. యుగయుగాల నాగరికస్రవంతు లిటువంటి స్థావరంలోనే చేరి రాణింపుకు వస్తాయి.

పదిహేనో శతాబ్దం ఆఖరుదశలో పారిస్ తుది నిర్బంధాలను కూడా సడలించి వ్యాపించింది. వ్యాపించి నిరోధించి నిలిచిన ప్రాకారా లన్నిటినీ నేలమట్టం చేసింది. వరద ముంచెత్తినప్పుడు మైదానంలో అక్కడక్కడ చెట్లు తలెత్తి చూసినట్లు ఈ మహానగరంలో అక్కడక్కడ కోటల శిథిలాలు తల చూపుతూ ఉంటాయి.

పదిహేనో శతాబ్దానికే పారిస్‌కి ఒక విశిష్టమైన ఆకారం ఏర్పడింది. ఎత్తైన గోపురమెక్కి చూస్తే—యౌవనవతులైన ఇద్దరు పుత్రికలమధ్య నిలిచిన వృద్ధమాతవలె, మూడు ప్రత్యేక నగరాలుగా, కనబడుతుంది. సీన్ నదిమధ్య ద్వీపానికి పరిమితమైనది సిటీ; సీన్‌నది దాటి దక్షిణానికి పెరిగినది యూనివర్సిటీ; ఉత్తరానికి పెరిగినది విల్. మూడింటిలోనూ అది విశాలమైనది విల్.

ఈ మూడు ప్రాంతాలకూ ప్రత్యేక లక్షణా లున్నాయి. సిటీలో (మధ్య ద్వీపభాగంలో) క్రైస్తవ మందిరా లధికం. విల్, అంటే ఉత్తరభాగంలో రాజ హార్మ్యాలూ, ధనవంతుల భవ

చాలా అధికం. యూనివర్సిటీలో (దక్షిణభాగంలో) విద్యాలయాలు హెచ్చు—ప్రసిద్ధ న్యాయసభా భవనం, నాటర్ డామ్ చర్చి సిటీలో ఉన్నాయి.

అంటే పారిస్‌లో ఉత్తరాన ధనవంతుల దర్పం, మధ్య సిటీలో బిషప్ అధికారం, దక్షిణాన విశ్వవిద్యాలయాధికారి ప్రభావం అధికమన్నమాట. వీరందరిపైనా రాజనియమితుడై ప్రవోస్ట్ అధికారి. ఈ ప్రవోస్ట్ పారిస్ పురపాలకాధికారి కాడు, రాజుకు బాధ్యుడు.

దక్షిణాన విద్యార్థులు నేరాలు చేస్తే సిటీలో విచారణ జరిపి, ఉత్తరభాగంలో శిక్ష విధించేవారు. మహారాజు దుర్బలుడైతే విద్యాలయాధికారులు జోక్యం కలిగించుకొని విద్యార్థుల్ని ఉరితీసే అధికారం తమకే ఉన్నదని దబాయించి, తమ విద్యార్థుల్ని తమ విశ్వవిద్యాలయాలవద్దే ఉరితీసేవారు. ఇటువంటి అసందర్భపు అధికారాలే కాకుండా సవ్యమైన అధికారాల్ని కూడా ప్రజలు సాధించుకోవాలంటే విప్లవాలూ దొమ్మీలే సాధనాలు. బలవంతాన కాకపోతే మహారాజులు ఎన్నడూ ఏ వర్గానికీ ఎటువంటి అధికారాలనూ ధారాదత్తం చెయ్యలేదు.

మూడు నగరాలలోనూ వీధులు, బాటలు అల్లిబిల్లిగా అల్లుకుపోయినట్లుంటాయి. కాని శ్రద్ధగా పరికిస్తే ఈ చిక్కుదారులలో కూడా తీరు తెన్ను ఉన్నట్లు బోధపడుతుంది. మూడు నగరాల మధ్యనుంచీ, పారిస్‌కి ఈ చివరనుంచి ఆ చివరకు ఉత్తర దక్షిణాలుగా రెండు రహదారులున్నాయి. మళ్ళీ మూడునగరాలలోనూ ఒక్కొకదానిలో మూడేసి వీధులు తూర్పు పడమరలకున్నాయి. ఆకులో ఈనెలకు ఈనెల్లుకున్నట్లు ఈ ప్రధాన మార్గాలనుంచి చిన్నచిన్న రోడ్లు పారిస్ అంతటా అల్లిబిల్లిగా అల్లుకుని ఉన్నాయి.

గోపురం పైనుంచి చూస్తే సిటీ నేలకెక్కిన ఓడవలె ఉంటుందని ఒక రచయిత అన్నాడు. యూనివర్సిటీ దాదాపు చతుర్భుజాకారంలో ఉంటుంది. విల్ ఉత్తరానికి విస్తరించిపోయింది. మందిర గోపురాలు, భవనాల అంతస్థుల వెనుక నగర నిర్మాణం కనపడదు. ఆకాశాని కెగిరిచూస్తే పారిస్ విశిష్టరూపం గోచరించవచ్చునేమో!

నాటర్ డామ్ చర్చి గోపురంనుంచి చూస్తే లెక్కలేనన్ని మందిరాలు, వాని గోపురాలు కనపడతాయి. దూరాన విశ్వవిద్యాలయం, ఇటు రాజభవనాలు, అక్కడక్కడ ఉరిస్తంభాలు, నేరస్థుల శిక్షకోసం నిర్మించబడిన ఇనపచక్రాలు దూరాన పొట్టి గుడిసెలు, దుబ్బులుకల మైదానం, మాయనిలయంకూడా గోచరిస్తాయి.—అంతటా రోమన్, గోథిక్, గ్రీక్—రోమన్, ఆధునిక రీతులన్నీ గోచరిస్తాయి. ఈ నగరంలో ఫ్రెంచి దేశచరిత్ర శిలాశిల్పంతో రచించినట్లు కళ్లకు కట్టినట్లగపడుతుంది. దాదాపు ఫ్రెంచిరాజు లందరి ఛాయలూ ఏ నిర్మాణంలోనూ కనపడక పోదు. వివిధకాలాల స్మృతి చిహ్నాలను పోగుచేసినట్లు కనపడుతుంది.

పారిస్ నగరశోభను చూడాలంటే ఏ పండుగరోజునో ప్రభాత సమయంలో గోపురమెక్కి చూడాలి. అప్పుడే దైవ మందిరాలలో గంటలు మేలుకొంటాయి. సూర్యభగవానుని పతాక తూర్పున సంకేత మివ్వగానే చర్చి గంటలు ఒక్కటొక్కటిగా మేలుకొంటాయి. వాద్య ప్రవీణుడు మొదట శ్రుతి పరిశీలించినట్లు మొట్టమొదట అక్కడక్కడ ఏ ఒకటిరెండు మందిరాలలోనో గంటలు మోగడం ప్రారంభిస్తాయి. ఎక్కడో ఆకాశంనుంచి వినవస్తున్నట్లుండే ఈ ధ్వనులకూ రూపం సిద్ధించినట్లనిపిస్తుంది. తరువాత ఉన్నట్టుండి అకస్మాత్తుగా అన్ని మందిరాలనుంచీ, వేలాది చర్చిల ఉపరిభాగాలనుంచి గంటలన్నీ గణగణ మ్రోగుతాయి. అయితే ఈ ధ్వనులలో అపశ్రుతి రాదు. ప్రతి ఘంటా నినాదం ఒక్కొక్కటే బయలుదేరి ఆకాశాని కెగసి అక్కడ క్రమక్రమంగా అన్నీ మేళవిస్తాయి. అప్పటికా సమ్మిళిత ధ్వని తరంగాలు నగరం నలుమూలలా వ్యాపిస్తాయి. అదిమొదలు ఘంటారవం మందిరాలలో జనించి భూమ్యాకాశాలను నిరంతరాయమై మధురస్వరంతో నింపివేస్తుంది. ఈ స్వర సమ్మేళనంలో వివిధ స్వరాలు కూడా ప్రత్యేకించి వినపడుతూనే ఉంటాయి. కొన్ని స్వరాలు సన్ననై తీక్షణంగా ఉంటాయి. కొన్ని మందరస్థాయిలో గంభీరమై అంతర్వాహినివలె ప్రవహిస్తాయి. రాజమందిరాలలోని ఘంటలు అధికార దర్పంతో మ్రోగుతాయి. మధ్యమధ్య నాటర్ డామ్ చర్చిలోని గంట గంభీరస్వరం అన్నిటినీ మించి నగరాన్ని దద్దరిల్ల చేస్తుంది. మొత్తానికి సప్త స్వరాలనూ పలికిస్తాయి పారిస్ దైవమందిరాలలోని గంటలు. ఈ ఘంటా నినాదాల తరంగాలలో పారిస్ నగరం మేలుకొంటుంది.

పారిస్ నగరంలో పగటివేళ వినవచ్చే ధ్వని సముదాయం నగర సంభాషణవలె ఉంటుంది; రాత్రివేళ నగరం ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విడుస్తున్నట్లుంటుంది. కాని పర్వదినాలలో ప్రభాత సమయంలో వినవచ్చేది నగరగానం అనవచ్చు. ఈ నగరగానం క్రమక్రమంగా ఆకాశంలో వ్యాపించి తరువాత నగరంపైకి మెల్లి మెల్లిగా దిగి లక్షలాది ప్రజల రణగుణ ధ్వనిలో లయమైపోతుంది. నగరం నాలుగు దిశలా ఆకాశం నాలుగు జంత్రవాద్యాలతో జంత్రగానం వినిపిస్తున్నట్లుంటుంది. పారిస్ నగరం ఒక జంత్రవాద్య సమ్మేళనం. ప్రభాత ఘంటా నినాదం ఒక అద్భుతగాన విశేషం. ఇటువంటి అద్భుతమైన నగరం ప్రపంచంలో అరుదు.

(ఇంకా వుంది)





# చుట్టాలు

'చుట్టాలు!' అనూ పతఘుచుకుంటే వొళ్ళు జల్లుమని ముచ్చెమటలూ పోస్తాయి. దీనికి కారణం, వాళ్ళు వొచ్చి మనది నెల్రగాసం వారంరోజులలో వూడేస్తారని కాదు—ఈ కరువు రోజుల్లో అదికూడా వుండొచ్చు—కాని యింతకంటె ప్రబలమైన కారణాలున్నాయి.

మాది సముద్రపువొడ్డున వున్న వొక వూరు. మాకు సముద్రానికెదురుగానే పెద్ద మేడ యిల్లూ, దాని చుట్టూ తోటా వున్నాయి. ఇదిగాక సుమారు అరవై యెకరాల మాగాణి వుంది.

ఒకనాటి వుదయం—యెనిమిది గంటలవుతుంది. ఏడున్నర గంటల రైలు వెళ్లింది. ఇంతట్లో వొక టాక్సీ వొచ్చి యింటిముందు నిలిచింది. అందులోంచి సుమారు నలభైయేళ్లతను మనిషీ, ఆవెనక ఆయన భార్య సుమారు నలభైయేళ్ళావిడా, యిద్దరు మొగపిల్లలూ దిగేరు. ఆయన సిల్కుసూటు వేసుకున్నాడు. ఆవిడ మంచి జరీపట్టుచీరా, దానికి తగిన జాకెట్టూ ధరించింది. మోడరన్ ఫేషన్‌లో వుంది. చేతిలో యుటిలిటీ బ్యాగూ, కాళ్లకి విలవైన స్లిప్పర్లూ వున్నాయి. పిల్లలకి కూడా అప్‌టుడేట్ డ్రెస్సు వేశారు. కారు చప్పుడు విని మా ఆవిడా, దాసీరామీ యిద్దరు నౌకర్లూ వొచ్చారు.

ఆయన నన్నుచూసి 'ఏమోయ్! సంపత్! క్షేమమా' అని మా ఆవిడవేపు చూసి 'ఏమలా చూస్తున్నావు పిల్లా! మా రఘునందన్‌బాబుని: నన్నే మరిచిపోయేవా యేమిటి? అదుగో మీ పిన్నీ, తమ్ముళ్లూ నిలబడే వున్నారు' అనగానే మా ఆవిడ వాళ్లని లోపలికి తీసుకు పోయింది. 'మీ నౌకర్ల పేర్లేమిటీ?' అని ఆయ నడిగేడు. చెప్పాను. 'యెస్! రంగన్నా సామానుపట్టుకురా' అంటూ తిన్నగా మేడ మెట్లెక్కి నా పడకగదిలోకి వెళ్ళి అక్కడ తన తోలు సూటుకేసూ, భార్య ట్రంకూ, పిల్లల చిన్న పెట్టెలూ, బెడ్డింగులూ పెట్టిస్తున్నాడు. రంగన్నంటున్నాడు, 'బాబుగారిదీ గది'

'మరేం పరవాలేదు. ఈ గది చాల్నులే. ఆ మంచం, పరుపూ బాగానే వున్నాయి. మరి నాకోసం యేమీ వెయ్యకు. ఓయ్ నూకాలూ! అమ్మగారికో మంచం, పిల్లలిద్దరికీ రెండు మంచాలూ వేయించీ,' అని చెబుతున్నాడు. టాక్సీవాడు 'సంపత్కుమార్‌బాబూ! నా అద్దె యిచ్చేస్తే వెళ్తానంటే, వాడి కైదురూపాయలిచ్చి పంపేసేను.

లోపలి హాలులోకి వెళ్ళేసరికి మా ఆవిడా, చుట్టాలూ వున్నారు. ఆయన, 'చూసేవూ పిల్లా! మాకోసం నువ్వేమీ యెక్స్ట్రాగా చెయించక్కర్లేదు. నాకు రాత్రి యేదో వొక పలహారం, నిద్రపొయ్యే

టప్పుడు వొక అర్థసేరు ఆవుపాలూ అలవాటు. మీ పిన్నిమాటా అంతే. అన్నంలో మీగడ పెరుగుంటేనేగాని. ఆవిడకీ, మీ తమ్ముళ్లకీ పనికిరాదు. పిల్లలకిమాత్రం రాత్రి పడుకోబోయే ముందు నేతిమిఠాయి అలవాటు. నువ్వింకేమీ చేయించొద్దు. ఇంతకీ వంటవాళ్లున్నారుకదా. వాళ్లే చేస్తారు' అని తనభార్యతో, 'ఏమే! యిది మన స్వంత యిల్లులాంటిది. వున్న కొద్దిరోజులూ మొహమాటంపడకుండా నీక్కావలసినవి చేయించుకో. ఓయ్ సంపత్! మీఅత్తకి యీమధ్య బ్లడ్‌ప్రెషరో, యేదో జబ్బా, మీ చిన్న బావకి రొనీమియూ వొస్తే మా డాక్టరుగారు స్థలం మార్చమన్నారు. ఇది సముద్రపొడ్డూ. అదీగాక నిన్నూ, మా పిల్లనీ చూసి యెన్నో సంవత్సరాలైందని మరో ఆలోచనలేకుండా యిక్కడికే వొచ్చేశాం. అన్నట్టు, నీకూతురుండాలి!'

'మా శారదా? అది లేపోయిల్లుండో రావాలి. వాళ్ల కాలేజీకి యివాళే శెలవులారంభం.' ఇంతట్లో మా పెత్తండ్రి కూతురు శాంతా, దానికొడుకూ వెనకింటిలోంచి వొచ్చి ద్వారందగ్గిర నిలబడ్డారు.

వెంటనే రఘునందనుగారు: 'ఈమని ఎవరోయ్' అన్నా డతినీరసంగా ఆమె వేపు చూస్తూ.

నా మనస్సుకి బాధ కలిగిందిగాని వోర్చుకుని 'అది మా విశ్వంబాబు కూతురు!' అన్నాను.

'లక్ష్మింపురంలో పంచాయితీబోర్డు గుమాస్తా.' అతడు పెదివి విరిచీసి, 'ఆగుంట డెవడు?' అనీసరికి నాకు అరికాలి మంట నెత్తికొచ్చింది.

మాశాంత సిగ్గుతో తలవొంచుకుని, మెల్లిగాఅంది, 'మామయ్యగారూ! వీడు నా కొడుకు. శెలవలికి మా అన్నయ్య రమ్మని రాస్తే మొన్ననే వొచ్చాం.' అంతలో మరింకేమి జరుగుతుందో అని మా ఆవిడ శాంతతో, 'వొదినా! వొంటింట్లో యేదో చప్పుడవుతోంది. జంకమ్మగారు నూతి దగ్గిరకెళ్ళేరు. పిల్లిగానీ పాలు తాగేస్తోందేమో చూడండీ' అని దాన్ని పంపించింది. తరవాత చుట్టమూ అతని కుటుంబం మేడెక్కిపోయేరు.

'సరేగాని, యీయన యెవరు? యెప్పుడూ చూచిన జ్ఞాపకంలేదు. మన కుటుంబం భోగట్టాలన్నీ తెలిసినవాడులా గున్నాడు?' అని అడిగాను.

'మన పెళ్ళికి వొచ్చేరు. మా పిన్నితోటి కోడలు తండ్రీని, యీయన తల్లీని, ఓవేలు విడిచిన పినతండ్రి పెత్తండ్రి పిల్లలుట. వోమాటు మా రామన్నయ్య యేదో సందర్భంలో చెప్పేడు.' అని మాఆవిడ అన్నది.

'వీళ్ల దేవూరు?'

'బాగా తెలీదు. రామవరమో, వెంకటాపురమో ఏదో.'

ఈలోగా మేడమీదనించి ఆవిడ 'రామీ! రామీ!' అని దాసీదాన్ని పిలిచి, 'బాబుగారికీ, నాకూ, పిల్లలకీ, వేణ్ణీళ్లు తీసి, సబ్బువుంచు' అని కేకేసింది. ఆయన రంగన్నని పిలిచేడు. మరి కొన్ని నిమిషాలకి ఆ కుటుంబం అంతా కిందకి దిగేరు. రంగన్న ముందు నడుస్తున్నాడు. వాడి బుజమ్మీద నాలుగు టర్కీతువాళ్ళూ, వో చీరా, వో జల్తారు

ధోవతీ, పట్టుపర్దూ వున్నాయి. కింది హోలు లోకి వొస్తూనే ఆవిడ 'అరూ'తో 'అమ్మాయీ! మా బట్టలు ప్రయాణంలో కుళ్ళయినాయి. చాకలి బట్టలు తేలేదు. మీ బాబయ్యగారికి అంతా తొందరే. అర్జంటుగా ప్రయాణం చేయించేరు.' అంటోంది.

ఆయన 'చాల్లే, మణి! ఈ సోదంతా యెందుకూ? ఇంతకీ పిల్లగానీ, అల్లుడుగానీ, వాళ్ల బట్టలు వాడేస్తున్నామని యేమైనా అనుకుంటే గదూ. రేపో, యెల్లుండో, మన నౌకరు బట్టలు పట్టుకుని రానేవొస్తాడు. అంతగా నీకు ముచ్చటైతే పిల్లకో పట్టు చీరా, అల్లుడికో పార్కుస్కిన్ను సూటూ మనం వెళ్లేముందు కొనియియ్యి.' అనేసి నీళ్ల

  

కొట్లోకి వెళ్లేరు.

నీళ్లపోతైన తరవాత మేడెక్కుతూ రఘునందనుగారు, 'శాంతా! కాఫీ, టిఫినూ మేడమీదికి తెచ్చి' అని ఆర్డరిచ్చేరు. పాపం మా శాంత అలాగేనని వాళ్లందరికీ అవి తీసుకెళ్ళి యిచ్చింది. ఇదంతా చూస్తూవుంటే నాకు తలతిరిగినట్టయింది. ఆ సమయానికి మా డ్రైవరు రామగోపాల్లు వొచ్చి, 'బాబూ! కమీషనరుగారు కబురుపెట్టేరు. తమరు బయలుదేరితే కారు రెడీ చేస్తా'నన్నాడు. సరేనని నేను స్నానంచేసి, కాఫీ, టిఫినూ తీసుకుని బయటికి వొచ్చేసరికి మా చుట్టంకూడా కిందకి వొచ్చేడు. 'ఏమోయ్! పెద్ద కారు కొన్నావే! ఏమిటది?' 'స్టుడిబేకరు. వైసుచేర్మెనయింతరవాత కొన్నాను. పాతికవేలైంది.' అంటూ నేను వెళ్లేను.

తిరిగి నే నింటికి వొచ్చేసరికి పన్నెండు గంటలైంది. మా చుట్టం నాకోసం యెదురు చూస్తున్నాడని మా అరూ చెప్పింది. నేను వెంటనే డ్రెస్సు మార్చుకుని ఆయన్ని రమ్మనిచెప్పి భోజనానికి కూచున్నాను. అప్పుడాయన 'మా శావూ, సంపత్! నాకు పదిగంటలకి భోజనం అలవాటు. మీ అత్తా, పిల్లలూ, నేనూ కలిసి వొకమాటే భోంచేస్తాం. మా వంటవాడు మేడమీదికే తెచ్చేస్తాడు.' అంటే నేను నాకోరకు కనిపెట్టుకుని వుండక్కర్లేదనీ: ఆయన తన యిష్టం వొచ్చినప్పుడు భోంచెయ్యొచ్చని చెప్పేను.

తరవాత జరిగిన సంగతేమిటంటే మా రంగన్నా, నూకాలూ ఆయనకీ, రామి ఆవిడకీ, పిల్లలకీ ముందు సేవచేసి, తరవాత మాకు కావలసిన పనులుచేసే యేర్పాటు అయనే చేసేడు. వాళ్ళు భోజనం, టిఫినూ మేడమీదికే తెప్పించుకోవడం, అవి మా శాంతే తీసుకెళ్లడం ఆరంభమైంది. నాకు యిదంతా మా అరూవల్ల తెలిసింది. మాఆవిడ శాంతని వొద్దంటే, ఆ అమాయకురాలు, 'పోనీ వొదినా. ఇంటికొచ్చిన పెద్దమనుష్యులకా మాత్రం చేస్తే యేంపోయిందీ. వాళ్ళనగౌరవంచేస్తే అన్నయ్యేమనుకుంటాడో.' అన్నాదిట. మా శాంత పేరుకి తగినట్టు శాంతమూర్తే. అది మా పెత్తండ్రి కూతురు. చిన్నప్పట్నించీ నాకు అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్లూ లేకపోబట్టి, దాన్ని చూస్తే నాకు తగని అభిమానం. దానికిద్దరు కొడుకులు. పెద్దవాడికి నేనే చదువు చెప్పిస్తున్నాను: ఎం. బీ. నాలుగోసంవత్సరం చదువుతున్నాడు. మా శారదకూడా యీయేడే మెడికలు కాలేజీలో చేరింది. వాళ్లిద్దరూ కొద్దిరోజుల్లో వొస్తారని చూస్తున్నాం.

ఇక కథ. నా కారుకి తెరిపివుండేది కాదు. నే నింటికి రాగానే, 'రాంగోపాల్! వేగంరావోయ్. కారు పనివుంది' అనే కేక వినబడేది. ఏదైనా కొత్తపిక్చరొస్తే, 'ఏమోయ్, సంపత్! మీ అత్తా, బావలూ, ప్రోగ్రాం వేశారోయ్. నువ్వూ;అరూకూడా రావాలి. రెండోఆటకి కారు రెడీచెయ్యమని రాంగోపాల్తో చెప్పూ' అనీ వాడు. మొట్టమొదటినాడు మేమందరం సినీమాహాలుదగ్గిర కారుదిగేం. వెంటనే ఆయన 'సంపత్! బాక్సులెంగేజిచేసీ లేకపోతే మీఅత్త షో ఎంజాయ్ చెయ్యలే'దన్నాడు. జేబులోంచి పర్సుతీస్తాడేమోనని వొకమినిటు చూసేను. కాని అటువంటిదేమీ జరగలేదు సరిగదా తనభార్యతో, 'మణీ! అల్లుడు బాక్సుతీసుకుంటున్నాడు. నువ్వు యిజీగా కూచుని చూడొచ్చు' అంటున్నాడు. మరి చేసేది లేక డ్రైవరుచేత బాక్సుటికెట్టు తెప్పించేను. ఈవిధంగానే యించుమించు ప్రతీ కొత్తఆటకి జరిగేది.

మా చుట్టాలొచ్చిన వారంరోజులకి మా శారదదగ్గిర్నించి టెలిగ్రాం వొచ్చింది. అదీ, మాశాంతకొడుకు విజయం, మర్నాడు ఎక్సుప్రెస్సులో వొస్తున్నామని. దానికి మేడమీద గది వుంటేనేకాని వీల్లేదు. అక్కడ యీచుట్టాలు మకాం వేసేరు. వాళ్లు యింతట్లో కదిలేటట్టు లేదు. మేమ, వాళ్లు ఆక్రమించేరని మానౌకర్లకీ, మా ఆవిడకీ కోపంగా వుండేది. నామెత్తదనమే యిందుకు కారణమనే వాళ్లు. ఆరోజు మధ్యాహ్నం వొంటిగంటవుతుంది. నేను కిందహాలులో యీజీచేరులో కూచుని కళ్లుమూసుకుని యేదో ఆలోచిస్తున్నాను. కొంతదూరంలో గుమ్మం దగ్గిర, రంగన్నా, నూకాలూ, రామీ, చేరి బాతాఖానీ ఆరంభించేరు.

నూకాలు: రంగన్నమామా! ఈసుట్టం గొప్ప డాబుసేత్తున్నాడు. లోపల లొటారంనాగుంది. ఎప్పుడుసూసినా బాబుగారి దిరేసువేసోకటం, బాబుగారి సిగరేట్లు, అన్నీ వాడేత్తున్నాడు. నూత్తే గొప్పనక్కనాగున్నాడు (నక్క అంటే అతిలోభి. విశాఖ జిల్లాపదం).

రంగన్న: అదేగా. బాబుగారు మామంచోరు: అల్లొచ్చిన కాణ్ణుంచీ మేడమీది కెల్లమేనేదు. 'ఏం బాబూ' అంటే 'పోనీరా' అంటారు. అమ్మగోరి పట్టుకోకలూ, రైకలూ, యీయమ్మ తొడిగేస్తున్నాది.

బట్టల బీరువాలకి తాళాలేసెయ్యండన్నా బాబుగారూరుకుంటారు.

రామి: అదేటిగాని, నూకాలుబావా! పాపం నోరెరగని శాంతమ్మగోరి ఆళ్ళకీ, పిల్లలకీ అన్నం కొణ్ణించి అన్నీ మేడ మీదికి తీసుకెళ్లాలిట. 'ఏటమ్మా' అలాగని నేనాసుట్టపమ్మనడిగితే మొకం ఇక్లించుకుని ఆవంటలమ్మ సుబ్బరంగా లేదట. అంచేత యీయమ్మకి శాంతమ్మే సెయ్యాలిట. ఆ యెంకమ్మ సేసిన వొంట తినొచ్చు గావాల.

రం: ఒరే! మన బాబుగోరికి యెక్కడి కట్లానికీ కాకే దొరకదు. ఎవెల్లాలన్నా కారింట్లో వుంచడు. సాకలి బట్టలు ఆళ్ళ నౌకరోడు తెత్తాడన్నాడు. యిప్పటికి నేదు. అంతా వొదులాదిలే. శారదమ్మగో రొచ్చి ఆల్మి కింద కీసుత్తారు. బాబుగోరు అడ్డు రాకుండా వుండాలి.

నూ: మామా! నేను మంచి గమ్మత్తు సేత్తాను. ఆ సుట్టపోణ్ణి 'బావూ నా తల్లికి రోగ మొచ్చిపడ్డది. సత్తదేంటో. పది రూపాయిలుంటే యిప్పించండి. బాబుగోరు జీతాలిత్తే యిచ్చేత్తా' నంటానురా.

రం: ఓరెర్రోడా! నా వాపసే సేస్రా. ఏటన్నాడో తెల్సా. చెక్కుబొక్కు వొత్తాదిట. ఆదొత్తే వో చెక్కు యిత్తాట్ట నాకు.

రా: సెక్కేటి బాబూ, అదేటి సేస్తుంటారు.

రం: నీకు తెల్దు. బాబుగారి కాడో పుత్తకం వుంది. అందులో కాయితంమీద సంతకంసేసి యింత డబ్బూ అని రాత్తారు. ఎవుడిసేతి కియ్యాలో ఆడి పేరు కూడా రాత్తారు. ఆ కాయితం పెట్టుకెల్లి, ఆ యీదిలో పెద్ద మేడ, 'బేంకు' కాడికెల్లి సూపితే డబ్బిత్తారు. రాంగోపా లెన్నో సార్లు బాబుగారి కలా తెత్తాడు.

నూ: అయితే మామా! ఆ సెక్కేదో యిచ్చాడా?

రం: ఆడి బొందిచ్చేడు. బుక్కే నే గాడికాడ. ఆడినౌకరోడు తెత్తాట్ట. బట్టలు తెచ్చినట్టే.

(అందరూ నవ్వారంభించేరు)

నూ: బాబుగోరింట్రా.

రం: యిన్నిరా. నానే సెప్పేద్దామను కుంటున్నాను.

వాళ్ళ బాతాకానీ అంతా నిజమే. తన చెక్కుబుక్కు రాగానే యిచ్చేస్తానని నాదగ్గిర మూడు వొందలు బదులని తీసుకున్నాడు. నాకంతా అయోమయంగా వుండేది. పొమ్మనలేక, ఆవిడదీ పిల్లడిదీ ట్రీటుమెంటు యెంతకాలం వుంటుందని అడిగితే 'డాక్టరు, వాటికి ప్రొలాంగుడు ట్రీటుమెంటు చెయ్యాలంటున్నాడు. ఎన్నాళ్లుంచడమో ఇంకా తెలీదంటాడు.

నేను కొంచం కదిలేసరికి నాకళ్లెక్కడివాళ్లక్కడి కళ్లిపోయేరు. కొంతసే పైంతరవాత చుట్టాలతో మా శారద మర్నాడు యెక్స్‌ప్రెస్‌లో వొస్తున్నాదని చెప్పడానికి మేడమీది కెళ్లేను. ఆ సంగతి రంగన్నంతకిముందే చెప్పినట్టుంది. నేను వెళ్ళేసరికి వాళ్ళు భార్యాభర్తలిద్దరూ నామంచం మీద కూచున్నారు. నేను చూసి వెనక్కి తిరిగిపోతూవుంటే ఆయన, 'రావోయ్. అంత మొహమాట మేమిటీ? మీ అత్త యేమీ అనుకోదులే' అన్నాడు.

ఆవిడ, 'పిల్ల రేపు ఎక్స్‌ప్రెస్‌లో వొస్తున్నాదిట? యింకెవరో కుర్రాడు కూడా వొస్తున్నాట్ట దాంతో?' అన్నది.

'వాడా? మా విజయం. శాంత కొడుకు. ఎం. బి. నాలుగో యేడు చదువుతున్నాడు. శారద కూడా ఆ కాలేజీలో నే మొదటి సంవత్సరం చదువుతోంది.'

ఆయన, 'పంచాయితీబోర్డు గుమాస్తా కొడుక్కి ఎం. బీ. యెలాగ చెప్పిస్తున్నాడోయ్?'

'లేదండీ. నేనే చెప్పిస్తున్నాను. వాడు తెలివైనవాడు. అన్ని క్లాసులూ మెడల్సుతోనే ప్యాసవుతున్నాడు. అలాటి వాణ్ణి వొదిలెయ్యటం నా కిష్టంలేదు.'

ఆయన తల వూచి 'వాళ్ళు లాడ్జిలో వున్నారా, హాస్టలులో వున్నారా?' అన్నాడు

'ఇప్పటికి వాడు మెన్సు హాస్టలులోనూ, అది విమెన్సు హాస్టలులోనూ వున్నారు. వొచ్చే సంవత్సరం అక్కడ వో యెస్టాబ్లిషుమెంటు పెడదామనుకుంటున్నాను.'

'అలాటి పనిమాత్రం చెయ్యకు. ఏమంటే ఆ కుర్రాడికి మీ శారదతో యీక్వలు స్టేటసు వుందనుకుంటాడు. బుర్ర తిరిగిపోతుంది. పెద్దవాణ్ణి నేను చెప్పింది విను.'

నాకు చిరాకు వేసి 'అదంతా నేను చూసుకుంటానులెండి' అనేశాను.

ఆవిడ, మాట మార్చేసి, 'ఏమోయ్! పిల్లకి మేడమీదే అలవాటని రంగన్న చెప్పేడు.' అన్నది. నామాట చొరనీయకుండా ఆయ నందుకుని 'భయంలేదే. మనం వుండేది కొద్దికాలమేకదూ. ఈలోగా అల్లుడికి తెలియదా యేమిటి? మన్నిడిస్టర్బు చెయ్యడు అని అడిగాడులే. అయితే పిల్ల యెప్పుడొస్తుందోయ్?'

'రేపుసాయంకాలం ఎక్స్‌ప్రెస్‌లో వొస్తుంది.'

'చంపేవే. ఆ టైముకే మేం డాక్టరింటికి వెళ్ళి, తరువాత పోస్టాఫీసుకెళ్ళి మా వూరికి టెలిగ్రాం చెయ్యాలనుకున్నాం, నాబట్టలూ, చెక్కు బుక్కూ తెమ్మని.'

'మీరు మరో యెరేంజిమెంటుచేసుకోవాలి!' అని నేను కిందికి దిగిపోయేను.

ఆ సాయంకాలం శారదా, విజయం, యిద్దరూ కారు దిగ్గానే నాకూ, అరూకి, శాంతకి నమస్కారం చేసేరు. శారద మాకు తెలియకుండా మేడమీది కెళ్ళిందికాబోలు, కిందకిదిగి వాళ్ళమ్మతో 'అమ్మా! మేడమీ దెవరే నారూము, నాన్నగారి రూమూ ఆక్రమించేరు?' అంటే 'చుట్టాలు. నువ్వు

# ★ చుట్టాలు ★

యీ గదిలో వుండు. విజయం, వాళ్ళమ్మ గదిలో వుంటాడు.' అని చెప్పేలోగా రఘునందను గారూ, ఆయన భార్యా, పిల్లలూ కిందకిదిగి, యిద్దరూ శారదని కౌగలించుకుని, విజయం వేపు వోక చూపు విసిరేసి, 'అమ్మాయీ! మీ మామయ్య లిద్దరూను, మురళీని, శశిని చూడు. యీ వాళ్ళందరం కలిసి భోంచేద్దామని' చెప్పేడు.

ఉదయం యేడుగంటలైంది. మేమందరం డైనింగు హాల్లో కాఫీ, ఫలహారాలకోసం కూచున్నాం. మా విజయం స్నానం చెయ్యడానికెళ్ళేడు. వంటావిడ వెంకమ్మగారు మాకు ప్లేట్లలో టిఫిను పెడుతున్నాది. మా శాంత వోక పెద్ద వెండిపళ్ళెంలో టిఫినులూ, గ్లాసులూ పెట్టింది. ఒక కెటిల్లో కాఫీ పోస్తున్నాది. అదిచూసి మా శారద, 'ఎవరికత్తా అవన్నీని?' అంటే 'మేడమీది చుట్టాలకని' చెప్పింది. పిల్ల మొఖం, కళ్ళూ, ఎర్రబడ్డాయి. తాచుపాములాగ లేచి 'ఏమిటీ! వాళ్ళకి మేడమీదికి నువ్వా తీసుకెళ్ళడం? నాన్నగారూ! మీరెలా గూరుకున్నారు? ఇదేనా, భోజనంకూడా తీసుకెళ్తున్నావా?' శాంత వూరుకుంది.

'ఇదీనా? సిగ్గు' అని శారద దంటూ వుండగా విజయం స్నానం చేసి వొస్తూ 'ఏమిటదీ' అన్నాడు. 'నీవూ సేం కాదుబావా. నువ్వెళ్ళి టాయిలెట్టు చేసుకుని కాఫీకి దయచెయ్యి' అని మా వేపు చూసి 'వాళ్ళరోగం నేను కుదురుస్తానని' మధ్య హాలులోకి వెళ్ళి 'ఏమండోయ్! తాతగారూ, కాఫీకి టిఫినుకీ దయచెయ్యండీ' అని కేకేసింది. మీదనుంచి, 'స్నానం చెయ్యందీ తినమమ్మా. రామిని నీళ్ళూ అన్నీ సిద్ధంచేసి రమ్మను' అని వినిపించింది.

'అలాగా! రామి పెరట్లో పనిచేసుకుంటున్నాది. వేన్నీళ్ళూ, చన్నీళ్ళూ, అన్నీ వున్నాయి. ఆ బట్టలేవో అవ్వగారు పట్టుకొస్తే అన్నీ మీకు తయారుచేస్తారు' అనేసి లోపలికొచ్చిందిశారద. ఈలోగా విజయంకూడా వొచ్చి టిఫినుతీసుకుంటూ 'ఏమిటి శారదా, బాంబుషెల్లులాగ విసురుతున్నావు మాటలూ? ఎవరిమీద?' అన్నాడు. నేను, 'ఏమీ లేదు. దానికోపం నీకు తెలీదా యేమిటని' సర్దేను.

మేడమీది గ్రూపంతా కిందకిదిగి యిటూ, అటూ మాడకుండా స్నానాలుచేసి, టిఫినూ కాఫీ సేవించి మేడమీది కెళ్ళేరు. మరికొంత సేపటికి 'రాంగోపాల్! కారు సిద్ధం చెయ్యి. డాక్టరు దగ్గిరికెళ్ళాలి' అని కేకేశాడాయన. దానికి మా శారద, 'తాతగారూ! కారులో నేనూ, బావా మా ఫ్రెండింటికి పదిమైళ్ళదూరంలో వున్న విలేజీకి వెళ్లాలి. కాబట్టీ, వో జట్కా మీద వెళ్ళండి.' అని జవాబు చెప్పి, నాతో, 'నాన్నగారూ! వీళ్లు కారుమీద డాక్టరు దగ్గిరకీ లేదు, యేమీ లేదు; షికార్లు తిరగడం, షాపింగులు చెయ్యడమూ నట. మన రాంగోపాలు చెప్పేడు. నాన్నగారితో యెందుకు చెప్పలేదంటే ఏమనుకుంటాగో అని వూరుకున్నాడట.' అంది. ఇంతలో డ్రైవరొస్తే 'ఏమోయ్! అమ్మాయి చెప్పింది నిజమేనా' అంటే, అవునన్నాడు వాడు.

శారదా విజయం కలిసి వెళ్ళేరు. నేనేమీ పనిలేక హాలులో కూచున్నాను. మా రంగన్నకీ రఘునందను గారికీ యీ కింది సంభాషణ జరిగింది.

రంగన్న: బాబూ! ఇప్పటికి పదిహేను రోజులైంది. తమ నౌకరూ లేడు, బట్టలూ, పెట్టెబుక్కూ లేవు, ఏటీలేదు. నా కొట్టా, నా కాలుకోటీ, రాంగోపాలు కోటీ, యిత్తామన్నారు. బాబుగోరికి చూటూ అమ్మగోరికి పటుచీరా కొంటామన్నారు. అంతా వుత్తదేనా?

రఘు: ఉండవోయ్! చూస్తూవుండూ.

రం: సూత్తానే వున్నాం. ముందుకూడా యిలాగే సూత్తాంగావాల.

అంతలో రామివొచ్చి, 'అమ్మా! నాకో కొత్తకోక కొనిత్తామన్నారు. ఎప్పుడిత్తారూ?' అంటె 'వుండవే. వెళ్లేటప్పుడిస్తానంది' ఆవిడ.

మరి వారంరోజు లైంతరవాత మేమూ, మా చుట్టాలూ భోంచేసి హాలులో కూచుని తాంబూలం వేసుకుంటూ వుంటే పోస్టు వొచ్చింది. అందులో మాఆవిడపేర వోకవరు వుంటె దాన్ని ఆవిడకు యిచ్చేస్తూ 'మీ రామన్నయ్య దస్తూరీలా గుంద'న్నాను. 'అలాగే. మీరు అన్నయ్యపేర రాసేరా యేమిటి?' అంది. 'మన రఘునందను గారూ, కుటుంబం వొచ్చినతరవాత రాసేను. అయినా మీ అన్నగారికి వుత్తరాలు రాయడం అలవాటూ లేదు, రాయడానికి తీరుబాటూ లేదంటావే. ఇంత అర్జంటుగా నా పేర కాకుండా నీపేర రాయడంలో యేదో విశేషం వుంద'ని అన్నాను.

ఆ వుత్తరం పట్టుకుని ఆవిడ లోపలికెళ్ళింది. అప్పుడు మాచుట్టం, 'రామన్నయ్యంటే యెవరూ?' అన్నాడు.

'లెఫ్టినెంటు కర్నల్, కె. రామారావు.'

'ఏంజేస్తున్నాడు?'

'నెలరోజుల కిందటివరకూ బెంగుళూరులో వుండేవాడు. ఇప్పుడు వైజాగుకి అతని రెజిమెంటుని బదిలీచేసేరు.'

ఆ సంగతి వినగానే ఆయన మొగం తెల్లబోయింది. వొంట్లో బాగులేదని పడుకుంటుంబంగా మేడమీది కెళ్ళేడు. మీదనించి 'ఓయ్, సంపత్! ఓ గంటలో ట్రెయినుంది కదూ. మేం వెంటనే వెళ్ళవలసిన పనొచ్చింది. కారు సిద్ధం చెయ్యమనూ' అన్నాడాయన. 'కారు కమీషనరుగారు తీసుకెళ్ళేరని' చెప్పేను. వెంటనే ఆయన జట్కా తేవడానికెళ్ళేడు.

వాళ్ళకి యెక్కణ్ణించీ యే వార్తా రాలేదు. ఇంతర్జంటుగా ఎంచేతనా యీ ప్రయాణం అని నే నాలోచిస్తూ వుండగా ఆయన జట్కా తెచ్చి వీధిలో పెట్టి మేడమీదకెళ్ళాడు అప్పుడు అయా ఆ వుత్తరం చూడ్డానికి రమ్మని నన్ను లోపలికి పిలిచింది. ఆ వుత్తరం చదువుతుంటే నాకు ఆశ్చర్యం, కోపం, సిగ్గూ, అన్నీ వొక్కమారే వొచ్చాయి. ఈయన యిలాగే మా రామం దగ్గరకికూడా (బెంగుళూరు) అనారోగ్యం మిషమీదవెళ్ళి అధార్టీ చెలాయించి, చివరికి కొన్ని వొస్తువులు పట్టుకుని వుడాయించేడట.

నేను బయటికి వొచ్చేసరికి చుట్టాలు జట్కా యెక్కుతూ 'వెడుతున్నామోయ్ సంపత్' అని చెప్పేరు. రంగన్నా, నూకాలూ 'మా సెక్కులు బాబూ'అనీ, రాము 'నా కోకమాటేంటమ్మా' అనీ వేళాకోళం చేస్తూ వుండగా జట్కా కదిలిపోయింది. రంగన్న 'బాబూ! తవరి బట్టలు ఆడూ, అమ్మగోరిబట్టలు అదీ యేస్కు వెల్లిపోతున్నారు.' అంటే 'పోనీరా'అని మేడమీదికెళ్ళి చూద్దునుగదా, మా రెండుబీరువాలలోని నదరైనబట్టలు చాలావరకూ మాయమై పోయేయి. పోనీ పీడ వొదిలిందని సంతోషించేను.

మరి వారంరోజులయ్యాక వీళ్ళనిమించిన చుట్టాలొచ్చారు. వాళ్ళు ముగ్గురు. ఒక బోడిముసలమ్మ, వొక నడివయస్సు విధవరాలు, ఒక పాతికేళ్ళ యువకుడూను. ఆముసలమ్మ పేరు లచ్చమ్మ. ఆవిడకీ, మాకూ, చాలాదూరపు చుట్టరికం 'లచ్చంపిన్నీ' అనేవాళ్ళం. రెండోఆవిడ లచ్చంపిన్ని కూతురు, భద్రకాళి. ఆ యువకుడు ఆమె కొడుకు గణపతి. వాళ్ళు మా వూరికి సుమారు నూరుమైళ్ళ దూరంలోవున్న సింగవరం అనే గ్రామంలో వుంటున్నారు. వాళ్ళు సాయంకాలం రైలులో దిగేరు. కొంతసేపు జట్కావాడితో కీసులాడితే వాడు సామానైనా యింట్లో పెట్టకుండా వెళ్ళేడు. ముసలమ్మ వొక పెద్దమూటా, చిన్నావిడ వొకట్రంకూ, అతడు చేతిలో వొక గోనెగుడ్డసంచీ, చంకని వొకపరుపుమూటా పట్టుకుని మధ్యహాలులో కొచ్చేరు.

అవి కిందపెట్టి, లచ్చమ్మగారు, 'చూశావురా సంపత్తూ! ఆజట్కావాడి పొగరూ?' అని ప్లేటు మార్చి 'యిదుగో మీభద్రక్క. నువ్వు చిన్నప్పుడు చూశావు' అని మొగానికి కొంగడ్డంపెట్టుకుని సప్తమస్వరంలో 'దానికి పెళ్ళవడం, యీనిసుగు పుట్టడం, దానిరాత యిలా అయిపోవడం, అన్నీ అయిపోయేయిరా' అని వెంటనే టోను మార్చేసి, 'అయితే యేంలే! బతికున్నాళ్ళూ, మీబావ దీన్నేం సుగబెట్టేడు?

(53-వ పేజీ చూడండి)

# విజ్ఞానవీథులు

"డాక్టర్"






## 159. టెలిఫోనులో ఒకేసారి పలువురి మాటలు

"ఒక వూరిలో పలుచోట్లనుండి ఒకే కాలములో చాలామంది చాలా ఫోనులలో మాట్లాడుతూండినా ఆ వార్తలన్నీ కలిసిపోకుండా వాటివాటి గమ్యస్థానాల్ని చక్కగా ఏవిధంగా చేరతాయీ?" అని పాలకొల్లునించి యమ్. సుబ్బారావుగారు అడిగేరు.

మనకి మామూలుగా కనపడే టెలిఫోను తీగలలోనుంచి ఒకొక్క తీగెలోనుంచి ఒక కాలంలో ఒక వార్తే ప్రసరించగలదు. మైలాపూరునుంచి త్యాగరాయనగరుతో మాట్లాడారంటే ఒక తీగ ఈ వార్త నిమిత్తము కేటాయింపు అయిపోయిందన్నమాటే. పదిమంది ఈ రెండు పేటలమధ్యా మాట్లాడుతూంటే పదితీగలు పనిచేస్తున్నాయన్నమాట. వాస్తవానికి ఈ రెండుపేటల మధ్యా 15 తీగలున్నట్టు టెలిఫోను స్తంభాల మీదివి లెక్కపెట్టి చూశామనుకోండి. 15 మంది మాత్రమే ఏకకాలమందు మాట్లాడడానికి ఏర్పాటు చేశారన్నమాట టెలిఫోను కంపెనీవారు. ఒకరు మాట్లాడుతూండగా ఇంకొకరు ఫోను ఎత్తితే ఈ సంభాషణకి అనుకూలంగా ఇంకొక తీగతో సంబంధము కలుస్తుంది ఈ ఫోనుకి. ఇదే రీతిగా—పది తీగలే వున్న పక్షంలో—పదిమంది మాట్లాడడానికి ఉపక్రమించినా తీగ తరవాత తీగ రంగంలోకి దిగుతుంది. పదీ పని చేస్తూంటే పదకొండోవారు మాట్లాడదామని ఫోను తీస్తే 'కిర్రు కిర్రు'మని అవకాశము లేదని తెలిపే శబ్దము వినబడుతుంది. వారు ఫోనుని దిమ్మమీద పెట్టేసి మళ్ళీ వెంటనే కావలిసిన నంబరు తిప్పతారు. పనిచేస్తూన్న పది తీగలలోనూ ఏ తీగలోని సంభాషణ పూర్తి అయిపోయినా, ఆ తీగ పనిలోకి దిగుతుంది అనే వీరి ఆశ.

అయితే దేశానికీ మరో దేశానికీ జరిగే సంభాషణలు—ట్రంకుఫోను లంటామే అవి—సాగే నిమిత్తము ఎన్ని తీగెలు వెయ్యగలరూ ఎవరేనా? వీటికి ఒక అవధి అంటూ వున్నదిగా? అటువంటప్పుడు ఒకే తీగ ద్వారానే కొన్ని సంభాషణలు ఒకే కాలములో జరుగుతూండడానికి ఏర్పాటు చేస్తారు. ఒకరు మాట్లాడే ధ్వనీ, ఇంకొకరు మాట్లాడే ధ్వనీ కలగాపులగం అయిపోవడము సామాన్యమే. కనక, ఒకరు మాట్లాడేటప్పుడు పుట్టే ధ్వనివల్ల కలిగే విద్యుత్తరంగాలను-వాహనము మోసుకుపోయే రీతిగా-మోసుకుపోగల తరంగాలమీద అధిష్ఠింపజేస్తారు. ఈ వాహన తరంగము నిరాటంకంగా గమ్యస్థానానికి చేరుకున్న తరవాత, ఈ వాహనమీఁదద అధిష్ఠించివున్న సంభాషణాతరంగాలను దింపి తర్జుమా చేస్తుంది అక్కడి యంత్రము. ఈ వార్త చెన్నపట్టణమునుంచి కలకత్తా చేరుతున్న క్షణమందే ఇంకొక వార్త కలకత్తానుంచి చెన్నపట్నము రావాలంటే, ఆ వార్తని ఇటు మోసుకురావడానికి వేరే ఇంకో వాహన తరంగాన్ని - మొందటిదానికన్న చాలా తేడాగావున్న వాహనతరంగాన్ని - మోత పని చెయ్యడానికి వాడతారు. పథికుడూ, సైక్లిస్టూ, మోటారు చోదకుడూ, మావటీ, గుర్రపు రౌతూ, ఒక దారిలో పోగలిగినట్టుగా, ఎన్ని వార్తలేనా, వాహనతరంగ భేదమువల్ల ఒకే దారిలో పోగలుగుతాయి.

వాహన తరంగము మన 'క' భాషలోని 'క' శబ్దము వంటిది. 'కరేకపు కనీకవు కరాకవ్వా?' అని వినబడగానే వాహనాతురమైన 'క'ని తీశేసుకుని 'రేపు నీవు రావ్వా' అని మనము తర్జుమా చేసుకున్నట్టు వాహన తరంగాన్ని తొలిగించి భాషాతరంగాల్ని మట్టుకే వినిపిస్తుంది ఆ రకపు ట్రంకుఫోను. పాడవులో సమానమైన తరంగాలయితే నే - ఒకదాని కెదురుగా ఇంకొకటి తారసిల్లినప్పుడు - విధ్వంసము గాని ఐకమత్యము గాని కలుపుతాయి గాని పాడవులలో విభేదించే వాహన తరంగాలు దేని దారిని అది వెళ్ళిపోడమే గాని ఢీకొట్టవు. ఈ తరంగాలమీద అచ్చుగుద్దినట్లు అధిష్ఠించిఉన్న సంభాషణతరంగాలు వాహనా లెక్కిన మనుష్యులలాగా చెక్కుచెదరకుండా గమ్యస్థానము చేరుకుంటాయి.

## చిట్టిప్రశ్నల జవాబులు

—దూరభూరేఖ ఎంతదూరము వుంటుందంటారా? సుమారుగా కనుక్కోడానికి సూత్రము ఇదుగో: సముద్ర మట్టమునకు 25 అడుగులు ఎత్తులో వున్నా రనుకోండి. ఈ ఎత్తుకి వర్గమూలము (*Square root*) కట్టండి అయిదు అడుగులు. ఈ అయిదుని ఒకటింపాతిక చేత గుణించండి. $6\frac{1}{4}$ వస్తుంది. దూర భూరేఖ మీ కంటికి $6\frac{1}{4}$ మైళ్ళు వుంటుంది. పాపి కొండలు సుమారు 2500 అడుగులు ఎత్తు. దీనికి వర్గమూలము 50. దీనిని $1\frac{1}{4}$ చేత హెచ్చవేస్తే $62\frac{1}{2}$ వస్తుంది. పాపి కొండల

మీద నిలబడితే దూర భూరేఖ 62 మైళ్ళ దూరంలో ఉంటుంది.

—చంద్రగోళము సగటున 240,000 మైళ్ళ దూరము ఉంది మనకి.

—ఉత్తర ధృవముకంటె దక్షిణధృవము కడ ఉష్ణోగ్రత తక్కువ. ఉత్తర ధృవము చుట్టూ ఆర్కిటిక్ సముద్రమే ఉంది. దక్షిణధృవము సముద్ర మట్టానికి పదివేల అడుగుల ఎత్తున ఉన్న పీఠభూమిలో ఉన్నది. దీనిమీద వర్షించిన మంచు పొరలు గట్టి, అడుగున ద్రవించి, జారి, సముద్రము లోనికి మంచుకొండలుగా దిగి, తేలి, సాగిపో తుంది. మంచుమీదినుంచి విసిరే గాలీ, చల్లనే, మంచు కరిగి తయారయే నీరూ చల్లనే. కనక ఉత్తర ధృవప్రాంతముకంటె దక్షిణ ధృవప్రాంతము చల్లన.

—అవును. సముద్రములో ప్రవాహా లుంటాయి. కాని విని వేగము సామాన్య ముగా గంటకు మైలుకంటె మించదు. కాని ఓసలు మామూలుగా గంటకు పదీ పది హేను మైళ్ళ వేగములో ప్రయాణిస్తాయి కనక సముద్రములోని గుడ ప్రవాహాలు లెక్కకి వస్తాయి. మెక్సికో గుడ ప్రవా హము ఫ్లారిడా ద్వీపకల్పానికీ బహామాదీవు లకీ నడుమ గంటకు మూడూ, అయిదూ మైళ్ళదాకా కూడా వుంటుంది.

—అవును జగత్తు నానాటికీ విస్తరిస్తున్న దనే వాదమున్నది. మన సూర్యుడున్న పాలపుంతలో నాలుగువేల కోట్ల నక్షత్రా లున్నాయని శాస్త్రజ్ఞుల అంచనా. ఇన్ని నక్షత్రాలుండి, అవి ఒకదానితో ఒకటి ఢీకొనిగాని, ఒకదాని చేరువగా ఇంకొకటి దూసుకునిగాని, పోయినట్లు సాక్ష్యము కన బడదు. నక్షత్రాల సహజగమనమును పరిశీ లించిన శాస్త్రజ్ఞులు, ఈ నక్షత్రాలన్నీ ఒకదానికొకటి దూరమౌతున్నాయని, అంటే జగత్తు విస్తరిస్తోంది అని, అభి ప్రాయ పడుతున్నారు.

—భూగర్భమునుంచి అగ్నిపర్వత బిల ములద్వారా వెలికివచ్చే. అగ్నిద్రవమూ, వేడినీటి గుండాలూ, భూగర్భ మింకా వేడి గానే ఉన్నదనడానికి సాక్ష్యాలు. భూమి లోకి తవ్వుకుంటూపోతే వెయ్యి అడుగులకి 16 డిగ్రీల చొప్పున ఉష్ణత హెచ్చుతుంది. దక్షిణ ఆఫ్రికాలోని లోతైన బంగారు గనిలో అట్టడుగున గని గోడల వేడికి కూలి వాళ్లు ఉడికిపోకుండా రిఫ్రిజిరేటర్లు పెట్టేరు.

—చంద్రబింబంమీది మచ్చలు సూక్ష్మ పరిశీలనకి అగ్నిపర్వత బిలాలులాగ కనపడ తాయి. ఇవి చంద్రగోళము చల్లారేటప్పుడు గోళ మధ్యభాగములో ఉండిన వాయువులు పైకి బుస్సుమని వచ్చేటప్పుడు ఏర్పడ్డ సుడి గుండాలనీ, ఆ స్థితిలోనే చల్లారిపోయిన చంద్రగోళముమీద అవి అలాగే కనబడుతు న్నాయనీ శాస్త్రజ్ఞుల నమ్మకం. అట్టు పెనముమీద కాలుతూన్నప్పుడు బుడగలు పైకి వచ్చి కన్నాలులాగ నిల్చిపోడము అందరు ఎరిగినదేకదా? ఇలాంటి కన్నాలు భూమిమీద కానరాకపోడానికి, ఎండా, వానా, గాలీ వల్ల జరిగిన అరుగుదలే కార ణము.

—ఎమీబానుంచి మానవుని దాకా వృద్ధిజెందిన జీవపదార్థ మింకా వృద్ధిచెందు తూనే వుంది. అయితే సూక్ష్మంగా 'జరి గిన వృద్ధి ఇదీ' అని చెప్పేటంత వీలుగా జరగదు మార్పు. ప్రాచీనకాలంలో ఒక తల్లికి ఒకసారి నలుగురూ అయిదుగురూ బిడ్డలు కలిగినట్లు లేదు. నేను తరుచుగా వింటున్నాము, ఇది మార్పుగదా? స్త్రీ పురుషుడు కావడము చరిత్రలో వినముకదా? నేను వింటున్నాము. ఇదీ పరిణామంలో ఒక వింతయే.






# పిచ్చుకగూడు



"రవి"

విజయదశమినాడు బీచివొడ్డుకుపోయి
ఊరకుండలేక ఉలిపి నగుట
చేసినాడ నొక్క చిన్న పిచ్చుకగూడు
యిసుకలోన కాలు యిట్టెదూర్చి

గూడుచూచి మదిని కోర్కెలు మొలకెత్తి
ముసురు కొనగసాగె ముమ్మరముగ
తనువు వాల్చి చేయి తలగడగా చేర్చి
భావ వీధులందు పయనమైతి

"వెదకి వెదకి చిన్న పిచ్చుక పిల్లను
పట్టితెచ్చి గూట కట్టివైచి
అనుదినమ్ము దాని కాహారమిడుచున్న
ఆడుకొనగవచ్చు హాయిగాను"

ఇంతలోన చాల యెత్తైన కెరటమ్ము
వచ్చి తాకి గూడు పాడుచేసె
గూటితోడ నాదు కోర్కెలవెల్లను
కూలిపోయె కుప్ప కూలిపోతి.





(సీరియల్)

# మనిషిలో మనిషి

DR. JEKYLL AND MR. HYDE

R. L. STEVENSON



## డాక్టర్ జెకిల్ నిశ్చింతగా ఉన్నాడు

## 3

పదిహేను దినములు గడచిన పిమ్మట, అదృష్ట వశాత్తు, డాక్టరు లాన్యను తన తాలూకు అయిదారుగురు పాతస్నేహితులకు విందు చేశాడు. విందుకు వచ్చిన వాళ్లందరూ ముసలివాళ్లే—అందరూ ద్రాక్షారసం అంటే రుచి తెలిసి దాని మంచిచెడ్డల విమర్శించగలిగినవాళ్లే. వీరందరూ బుద్ధిమంతులు—మర్యాదస్థులు. అట్టర్సను మాత్రము, విందు అంతా అయినతర్వాత, మిగిలిన వాళ్లందరూ వెళ్లిపోయిన తర్వాత, అక్కడే తిష్ఠవేసి కూర్చున్నాడు. ఈ విధంగా తానుమాత్రము దిగబడి బాతాఖానీ చేస్తూ ఉండడం యీ పర్యాయమే అతను క్రొత్తగా చేసిన పన్నాగము కాదు. ఈ విధంగా ఇదివరకు అనేక డజనుల పర్యాయము చేశాడు. అట్టర్సను అంటే కొందరికి యిష్టుడు. ఇష్టుడైనవారికి పరమయిష్టుడు. కంచుమ్రోగినట్లుగా ఊకదంపుగా తియ్యగా మిర మెచ్చులు మాట్లాడే స్నేహితబృందమంతా గడపదాటి బయటకు నిష్క్రమించినతర్వాత, సరదాలేని అట్టర్సనుగారితో గోష్ఠి సాగించవలెననే దిలాసాగలవాళ్లు చాలామంది ఉన్నారు. సాధారణంగా ముఖప్రీతి పేల పిండి కబుర్లతో తలదిమ్మెత్తినప్పుడు ఇటువంటి మితభాషితో ఏకాంతప్రియునితో కాలక్షేపం చేయడంవల్ల మనస్సుకు ఎంతో స్థిమితముగా ఉండేది. అతని మౌనం వల్ల వారి మనస్సు నిదానంగా ఉండేది. ఈ విషయంలో డాక్టరు జెకిల్ కూడా, అట్టర్సనుగారి గోష్ఠికి మక్కువపడేవాడని చెప్పవలసిందే. అక్కడ హాలులో ఉన్న సెగడుకు ఎదురుగా డాక్టరు జెకిల్ కూర్చున్నాడు. యాభైఏండ్లవాడు. నున్నని ముఖం. భారీసైజు ముఖం. దృఢకాయుడు. మనిషిలో కొంత ఓరచూపు ఉంది. అతనిలో సామర్థ్యం కన్పిస్తోంది. దాక్షిణ్యం కూడ చాలా ఉంది. అట్టర్సను అంటే అతనికి నిజమైన, గాఢమైన అభిమానం అంతరంగంలో ఉంది. ఆ విషయం అతని చూపులోనే కన్పిస్తుంది.

అట్టర్సను సంభాషణ ప్రారంభించి, "నీతో మాట్లాడవలెనని నాకు చాలా ఆసక్తిగా ఉంది. నీవు వ్రాసినటువంటి ఆ వీలునామా సంగతి నీకు తెలుసు కదూ ?" అన్నాడు.

ఈ విషయం అతనికి అంతగా రుచించదని పరాయివాడు అనుకుంటాడు. కాని, డాక్టరు జెకిల్‌కు ఆ ప్రస్తావన సరదాగానే ఉంది. "అట్టర్సన్ ! నావంటి వాడు నీకు పార్టీనై నీ ఖాతాదారు అవడం నిజంగా నీ దురదృష్టం. నావీలునామా విషయమై నీవు పడుతున్నంత ఆందోళన నేనింకెవ్వరిలోనూ చూడలేదు. శాస్త్ర చర్చలలో నా అప్రాచ్యపు సిద్ధాంతములకు డాక్టరు లాన్యనువంటి పాతధోరణి పండితుడు నీ మాదిరిగానే నన్నుగూర్చి కొంతఆవేదన పడుతూ ఉంటాడు. అతను చాలా మంచివాడు. నాకు తెలుసు. ఆవిషయమై నీవేమీ ముఖం చిట్లించనక్కరలేదు. డాక్టరు లాన్యను దివ్యమైన సత్పురుషుడు. అతని మంచితనం యింకా నాకు బోధపడవలసింది చాలా ఉంది. ఎన్నిచెప్పినా, అతనిదిమాత్రం తాతలనాటి పాతపాండిత్యం. పాత సిద్ధాంతాలకు సాష్టాంగప్రణా

మూలం : రాబర్ట్ లూయీ స్టీవెన్సన్  అనువాదం : దాసు వామనరావు

 మనిషిలో మనిషి 

మాలుచేసే వట్టి అంధప్రాయుడు. డాక్టరు లాన్యను విషయములో నాకు ఉన్న ఆశలు భంగమైనట్లుగా యింకెవ్వరి విషయంలోనూ భగ్నం కాలేదు. అని డాక్టరు జెకిల్ ప్రస్తావించాడు.

"మీ వీలునామాను నేనెన్నడూ హర్షించ లేదు. ఆసంగతి మీకు తెలుసుగదా" అని అట్టర్సను తన వ్యవహారవిషయం తిరిగి సాగించాడు. డాక్టరు లాన్యను విషయమై ప్రారంభించిన కొత్తవిష యాన్ని అంతగా అట్టర్సను లక్ష్యం చేయలేదు.

"నావీలునామా విషయమా? అవును. నిజమే. అదంతా నాకు తెలుసు. నీవు నాతో అన్నావుకూడా." అని డాక్టరు జెకిల్ చలాకిగా మాట అందుకున్నాడు.

"మంచిదే. ఆవిషయమే తిరిగీ నీతో చెప్ప తున్నాను. హైడ్ అనే యువకుని గూర్చి యిటీవల నాకు కొంత తెలియవచ్చింది." అని లాయరు చర్చ సాగిస్తూ అన్నాడు.

ఆ మాటతో డాక్టరు జెకిల్ ముఖం తెల్ల బోయింది. పెదవులు పాలిపోయినాయి. అతని చూపులో కళ లేదు. "ఆవిషయమై యింకా చెప్పితే నేను వినదలచుకోలేదు. ఈ ప్రస్తావనకు స్వస్తి చెప్పవలెనని మన మిద్దరమూ యిదివరకే ఒప్పందం చేసికొన్నాం"అని డాక్టరు జెకిల్ అన్నాడు.

"నేను విన్నదంతా చాలా ఘోరంగా ఉంది" అన్నాడు అట్టర్సను.

"ఆ వ్యవహారంలో కలిగే కొత్త మార్పు ఏమీ ఉండదు. నా సందర్భస్థితి ఏమిటో నీవు సరిగ్గా గ్రహించడంలేదు. నాపరిస్థితి అంతా ఒక సంకటావస్థగా ఉంది అట్టర్సన్! నా వ్యవహారం అంతా విపరీతావస్థగా ఉంది. చాలా విపరీతావస్థగా ఉంది. కేవలం మాటలతోనూ చర్చలతోనూ చక్క బడే వ్యవహారం కాదిది." అని డాక్టరు జెకిల్ కొంత అగమ్యగోచరంగా సంభాషించాడు.

అప్పుడు అట్టర్సను యిలా అన్నాడు. "జెకిల్! నీవు నన్ను ఎరుగుదువుగదా. నేను నమ్మదగిన మని షినేగదా. ఈవిషయంలో నీవు నాతో మర్మం విడిచి ఉన్నదంతా వివరించి చెప్పు—నిన్ను ఆ చిక్కులలో నుంచి నేను నిస్సంశయంగా తప్పించగలను."

ఆ మాటలకు డాక్టరు జెకిల్ యిచ్చిన ప్రత్యు త్తరం ఇది. "అట్టర్సన్ మహాశయా! నీవు నామేలు చాలా కోరినవాడవు. నిజం. ముమ్మాటికీ నామేలు కోరినవాడవు. అందుకై నాకృతజ్ఞత వెల్లడించడానికి మాటలు చాలవు. నీవంటే నాకు పూర్తినమ్మకం ఉంది. నిన్ను నమ్మినట్లుగా బ్రతికిఉన్న వాళ్లల్లో ఏనర మానవుణ్ణీ నేను నమ్మను. ఆమాటకు వస్తే అంతగా నన్ను నేనే నమ్మను. కాని, అసలువిషయం నీవు అపోహ పడుతున్నది కానేకాదు. నీవు అనుమానించినంత అధ్వాన్నంకాదు నా విషయం. నీకు ఒక్కవిషయం నొక్కి వక్కాణిస్తున్నాను. కావాలంటే ఈక్షణంలో హైడ్‌తో నిమిత్తం లేకుండా నేను ఉండగలను ఆ విషయంలో నీకు నేను చేతిలో చేయివేస్తాను. నీకు నేను కృతజ్ఞుణ్ని అని మరల మరల నివేదించుకుంటు న్నాను. అట్టర్సన్! నీకొక్క చిన్నమాట చెప్తాను. అది నీవు సావధానంగా చిత్తగిస్తావని నాఊహ. ఇది కేవలము నా ఆంతరంగిక వ్యవహారవిషయం. గనుక, దానిని పైకెత్తవద్దని నామనవి—"

సెగడువంక చూస్తూ అట్టర్సన్ కొంచెంసేపు ఏదో ఆలోచన చేశాడు.

"అవును నీవు చెప్పినదంతా చాలా సబబుగా ఉంది" అని అట్టర్సను లేవబోతూ చిట్టచివరకు అన్నాడు.

ఆమాటమీద డాక్టరు జెకిల్ తిరిగీ ప్రస్తావిస్తూ, అన్నాడు. "మంచిది - సరే - ఈవ్యవహారవిషయమై మనము కొంత ప్రస్తావించాము గనుకనున్నూ యీ విషయమై యిదే ఆఖరుపర్యాయంగా "మనం ముచ్చ టించడం అవుతుంది గనుకనున్నూ ఒక్కవిషయం నీవు గ్రహించాలని నా అభిలాష. పాపం! హైడ్ విషయంలో నాకు చాలా సన్నిహితప్రసక్తి ఉంది. అతనిని నీవు చూచావని నాకు తెలుసు. అతడు కూడా ఆసంగతి నాతో చెప్పాడు. అతడు నీతో చాలాదురుసుగా బేమర్యాదగా ప్రవర్తించిఉంటాడు. అయినప్పటికీ, ఆయువకుని విషయంలో నాకు చాలా ఆప్తసంబంధం ఉంది. నేను లేకుండా పోయినట్లయితే, అతనిని నీవు సహించి, అతనికి చెందవలసిన హక్కు భుక్తములు అతనికి చెందేటట్లుగా నీవు చేస్తానని నాకు

వాగ్దానం చేయి. అంతేచాలు అట్టర్సన్! నిజవిషయం అంతా నీకు బోధపడితే నీవు తప్పకుండా చేస్తావనే నావిశ్వాసం. నీవు ఆవాగ్దానం నాకుచేస్తే, నా మనస్సులో ఉన్న బరువు చాలా తొలగిపోతుంది.

ఆమాటలు లాయరు విని "అతడంటే నాకు యిష్టమే అని మాత్రము నేను నీతో ముఖప్రీతిగా అనలేను" అన్నాడు.

అట్టర్సను బుజంమీద డాక్టరు జెకిల్ తన చెయ్యివేసి తట్టుతూ "అదికాదు నేనుకోరేది. జరుగవలసినదంతా న్యాయంగా జరిగితేచాలు. నేను యీ తనువు చాలించినతర్వాత నాయందు గౌరవముంచి నీవు అతనికి చేయవలసిన సహాయం చేయవలెనని మాత్రమే కోరుతున్నాను" అన్నాడు.

అట్టర్సన్ అణచుకోలేని నిట్టూర్పువిడిచి "సరే! అల్లాగే నేను నీకు వాగ్దానం చేస్తున్నాను" అన్నాడు.

## క్యారూ హత్యావ్యవహారం

## 4

ఒక సంవత్సరకాలం గడచిన పిమ్మట 18-సం॥ అక్టోబరుమాసంలో కనివిని యెరుగని ఘోరమైన హత్య ఒకటి జరిగింది. ఈ హత్యా వ్యవహారంతో లండనునగరం అంతా అట్టుడికినట్లుడికి పోయింది. హత్య చేయబడిన మనిషి చాలా ఘరానా కుటుంబంలోని వాడగుటవల్ల నగరంలో మరింత గగ్గోలు పుట్టింది. హత్యనుగూర్చి తెలియవచ్చిన వివరములు ఎక్కువగా ఏమీ లేవు. కాని, తెలిసిన కొద్ది వివరములైనా చాలా దారుణంగా ఉన్నాయి. నదిఒడ్డున సమీపంలోనే ఒకయిల్లు ఉంది. ఆయింట్లో ఒక పనికత్తె (పెండ్లికానిపడుచు) నివసిస్తోంది. ఆమె రాత్రి పదకొండు గంటలవేళ నిద్రపోదామనే ఉద్దేశంతో మేడమీదకు వెళ్ళింది. తెల్లవారుజామున పొగమంచు నగరమంతా ఆవరించింది. కాని, తత్పూర్వం రాత్రి అంతా మబ్బూగిబ్బూ లేకుండా ఆకాశంఅంతా నిర్మలంగా ఉంది. ఆనాడు పౌర్ణమి. పండువెన్నెలతో వీధిఅంతా పిండి ఆరబోసినట్లుంది. ఆ మేడమీద కిటికీలోనుంచి చూస్తే వీధి అంతా చక్కగా కన్పిస్తుంది. ఆపడుచుపిల్ల కొంచెం విలాసంగా వెన్నెలవిహారాలు చేసేరకం అంటారు. ఆనాటిరాత్రి కిటికీప్రక్కనేఉన్న ఒక పెట్టెమీద ఆపిల్ల కూర్చుంటే తియ్యనికమ్మని ఊహలు ఏవో కలలవలె అలలవలె ఆ అమ్మాయి మనస్సులో తిరుగుతున్నాయి. ఆనాటి రాత్రి ఆపిల్లకు ఈప్రపంచంమీదనే మంచిసరదా కలిగిందట. మానవలోకం అంటే ఆనాటిరాత్రి కలిగినంత మక్కువ యింకెప్పుడూ ఆమె జన్మలో కలుగలేదట. ఆరాత్రి జరిగిన ఘోరవిషాదం ఆపిల్ల వివరించి చెపినప్పుడు కంట తడిపెట్టి పైరీతిగా అంటూ ఉండేది. ఆరీతిగా ఆపిల్ల అక్కడ కూర్చుండి కిటికీలోనుంచి చూస్తూఉంటే తెల్లని తలవెండ్రుకలు కలిగి వయస్సు ముదిరినటువంటి అందగాడైన ఒక పెద్దమనిషి ఆసందులోనికి వస్తూ ఉన్నట్లుగా ఆమె కనిపెట్టింది. ఆ పెద్దమనిషికి ఆసందులోనే ఒక పొట్టిమనిషి ఎదురుగా నడిచివస్తున్నాడు. ఇతనిని ఆపిల్ల మొదట్లో అంత ఎక్కువగా లక్ష్యంచేసి గమనించలేదు. మేడ కిటికీవద్ద కూర్చున్న ఆపిల్లకు ఎదురుగా సందులో వాళ్ళిద్దరూ కలిసికొన్నారు. ఒకరితోఒకరు మాట్లాడుకొనుటకు వీలైనంత దగ్గరలోకి వచ్చారు. పొడగరియైన పెద్దమనిషి చాలా మర్యాదగా రెండోమనిషిని పలుకరించాడు. పలుకరించిన పిమ్మట ప్రస్తావించిన విషయంలో విశేషమేమీ లేదు. అతడు తన చేయి చాపి ఏదో చూపించుచుండుటనుబట్టి చూడగా, తనకు కావలసినత్రోవ ఏదో అడుగుతున్నాడని అర్థమౌతూ ఉంది. ఆపొడుగుపాటిమనిషి ముఖం వెన్నెలలో బాగా ప్రకాశిస్తోంది. అతని ముఖంవంక ఆపిల్ల సరదాగా చూస్తూ ఉంద. అతని ముఖంలో పాతరకపు సత్యకాలపు మానవుని మంచితనయూ, మర్యాదా బాగా కన్పిస్తున్నాయి. చక్కని సంపన్నగృహస్థుగా కన్పించాడు. రెండోమనిషివంక కూడా ఆపిల్ల దృష్టి మరల్చి చూచింది. ఇదివరలో ఒక పర్యాయము తన యజమాని సందర్శనార్థం వచ్చియుండినటువంటి హైడ్ అనేటటువంటివాడే యితడని గుర్తుపట్టింది. ఇదివరకు అతనిని చూడగానే ఆపిల్లకు ఒక విధమైన అసహ్యం కలిగింది. అతనిచేతిలో లావుపాటి చేతికర్ర ఒకటి ఉంది. ఆకర్రను అతడు సరదాగా యిటూ అటూ ఆడిస్తున్నాడు. అతను అక్కడ నిల్చున్నంతసేపూ ఒక్కమాటయినా మాట్లాడలేదు. ఆ మనిషికి ఓర్పుఅనేది లేనట్లుగా పళ్లబిగువున చెప్పినదంతా



# మనిషిలో మనిషి



వింటూ నిల్చున్నాడు. అప్పుడు అతనికేదో శివమెత్తినట్లుగా ఆగ్రహావేశం హఠాత్తుగా వచ్చింది. తన పాదంతో నేలను ఒక్క తన్నుతన్ని తన చేతి కర్రను గిర్రున బాణాకర్రలాగున త్రిప్పి, పిచ్చి ఎత్తినవానిలాగున హుంకరించాడు. ఆ పొడుగాటి పెద్ద మనిషి ఈ తరహా చూచి నిర్ఘాంతపోయి వెనుకకు అడుగువేశాడు. ఇక హైడ్‌కు పట్టపగ్గాలు లేవు. వెంటనే ఒక్క దెబ్బతో ఆ పెద్ద మనిషిని నేలమీదకు పడగొట్టివేశాడు. మరుక్షణంలోనే అతడు క్రూర కిరాతునివలె లంఘించి క్రింద పడియున్న మనిషిమీద తన కాళ్లుపెట్టి త్రొక్కుతూ కర్రతో దెబ్బమీద దెబ్బ ఆపకుండా కొట్టడం సాగించాడు. ఆ దెబ్బలకు ఎముకలు పెళపెళమని విరిగిపోయినాయి. కళేబరం రస్తామీద ఎగిరిపడింది. ఈ ఘాతుక దృశ్యములతో ఈ భీకరధ్వనులతో ఆపిల్ల గుండె తల్లడిల్లి మూర్ఛపోయింది.

ఆపిల్లకు తిరిగి స్పృహ వచ్చేసరికి రాత్రి రెండు గంటలయింది. అప్పుడు పోలీసువారికి ఆమె కబురుచేసింది. ఖూనీ చేసినవాడు పలాయనమై అప్పటికే చాలా సేపయింది. కాని, అతడు చంపినటువంటి మానవుడు ఆ సందుమధ్య తుక్కు తుక్కు అయి పడిఉన్నాడు. అతనిని ఏకర్రతో చావగొట్టినాడో ఆ కర్ర చాలా గట్టిచేవగల మంచి రకం కర్ర. అటువంటికర్ర కూడా, యీ కిరాతకృత్యంలో మధ్యకు విరిగిపోయింది. విరిగిపోయిన సగం భాగం ఆవిసురులో వెళ్లి రోడ్డు ప్రక్కనున్న మురుగు కాల్వలో పడింది. ఆ కర్ర తాలూకు రెండో అర్థభాగం హంతకుని చేతిలోనే ఉండడంవల్ల అతడు వెంటతీసికొని పోయిఉంటాడు. చనిపోయినవాని దుస్తులలో ఒక పర్సున్నూ, ఒక బంగారు గడియారమున్నూ కన్పించాయి. వేరే కార్డులుగాని, కాగితాలుగాని ఏమిన్నీ లేవు. చీట్లు అంటించి సీలువేసిన కవరు ఒక్కటి మాత్రం ఉంది. బహుశః దానిని పోస్టులో వేయడానికి తీసికొని పోతూ ఉండవచ్చు. ఆ కవరుమీద అట్టర్సను పేరూ, చిరునామా వ్రాయబడి ఉన్నాయి.

మరునాడుదయము, లాయరు గారైన అట్టర్సను వద్దకు ఆయన యింకా నిద్రలేవకపూర్వమే, ఆ కవరును తీసికొని ఒకరు వచ్చారు. సంగతి సందర్భములన్నీ అతనికి వివరించారో లేదో, ఆ కవరును 'అతడు చూచాడో లేదో, వెంటనే అట్టర్సను గంభీరంగా మూతివిరిచి, "శవాన్ని నేను చూచేవరకు ఇప్పుడేమీ చెప్పలేను" అన్నాడు. ఇది చాలా పెద్దగాథ కావచ్చు. నేను డ్రెస్ వేసికొని వచ్చేవరకు దయచేసి కొంచెం కూర్చోండి" అని అట్టర్సను పలికి, అదే గంభీర ముఖవైఖరితో ఆదరాబాదరా ఏవో కాఫీ నీళ్లూ ఫలాహారమూ ఆరగించి, పోలీసుస్టేషనుకు బండీమీద వెళ్లాడు. అక్కడికి శవాన్ని అదివరకే చేర్చారు. పోలీసుస్టేషనులో ఒక గదిలో ఉంచబడిన ఆ శవాన్ని అతడు చూచి తల పంకించాడు.

"అవును. ఈయనను నేను గుర్తుపట్టగలను. ఈయనే సర్ డాన్వెర్సు 'క్యారూ' అని చెప్పవలసి వచ్చినందుకు నాకు విచారంగా ఉంది." అని అట్టర్సను అన్నాడు.

వెంటనే పోలీసుఅధికారి ఆశ్చర్యపడి, "ఏమిటండీ! ఎంతమాట! అటువంటిది సంభవమా?" అని ప్రశ్నించాడు. కాని యిటువంటి పెద్దకేసులలో తన పోలీసువృత్తికి సహజమైన ఉత్సాహశక్తితో కళ్లుత్రిప్పి, "అయితే, ఇది చాలా పెద్దగొడవ అవుతుందన్నమాట—మనిషిని వెతకిపట్టడం విషయంలో మీరుకూడా మాకు సహాయం చెయ్యవచ్చు" అన్నాడు. మేడమీద ఉండే పనికత్తె చూచిచెప్పిన సంగతులన్నీ సంగ్రహంగా వివరించిన పిమ్మట విరిగిన చేతికర్ర ముక్కను అట్టర్సనుకు చూపించాడు.

ఈ సందర్భంలో హైడ్ పేరు ఎత్తగానే అట్టర్సను వెనక్కి జంకి కలవరపడ్డాడు. కాని, చేతికర్రముక్కను చూపించగానే ఆయనకు సంశయ నివృత్తిఅయింది. విరిగినకర్ర తునకను చూడగానే అది తానిదివరకు పెక్కేండ్లక్రిందట హెన్రీ జెకిల్‌కు బహుమానంగా యిచ్చిన చేతికర్ర యని సులభంగా గుర్తించాడు.

"ఈ హైడ్ అనేమనిషి చాలా పొట్టివాడేనా?" అని అట్టర్సను ప్రశ్నించాడు.

"విశేషంగా పొట్టివాడనిన్నీ చాలా దుర్మార్గపు చూపులు గలవాడనిన్నీ ఆపనికత్తె చెప్పింది"

అన్నాడు పోలీసు ఆఫీసరు.

అట్టర్సను కొంచెంసేపు యోచించాడు. చివరకు తలపైకెత్తి, "నాబండిలో మీరు వస్తే అతను ఉండే యిల్లు మీకు నేను చూపిస్తాను" అన్నాడు.

అప్పటికి ఉదయము తొమ్మిది గంటలైంది. ఆ ఋతువులో అదే మొదటిరోజు మంచు ప్రారంభం. ఆకాశం అంతా గోధూళికప్పినట్లుగా మంచుతెరలు ఆవరించాయి. కాని ఈదురుగాలి దిట్టంగా వీస్తూ ఉండడంవల్ల మంచుతెరలు మధ్యమధ్య చెదరిపోతున్నాయి. ఆ మంచులో గుర్రపుబండి వీధి తర్వాత వీధిదాటి మెల్లిగా నడుస్తోంది. ఆ నీరెండలో వింతరంగుల కాంతులు మంచుతెరలమధ్య అట్టర్సనుకు కన్పించాయి. ఇక్కడ ఈనగరభాగంలో వెల్తురు తక్కువగా ఉంటుంది. సాయంకాలపు కనుచీకటివలె ఉంటుంది. మంటల్లోనుంచి వచ్చిన ఎర్రని వెల్తురువలె మంచులోనుంచి ఉదయదీప్తి ఎర్రగా కన్పిస్తుంది. మధ్య మధ్య రవ్వంత మంచు చెదిరిపోయినప్పుడు సూర్యకిరణం బాణాలాగున తగులుతూ ఉంటుంది. సోహో చౌకు అసలే బావురు మన్నట్లుంటుంది. ఆనాటిఉదయం వింత రంగుల మంచు ముసుగులలో, బురదరస్తాలతో, మురికి మెడ్డె బాటసారులతో, యిదివరకెప్పుడూ ఆర్పియుండని దీపాలతో, లేదా ఇప్పుడు చుట్టూ ముట్టడించిన మసక చీకటిని పారదోలుటకై తిరిగి వెలిగింపబడిన దీపాలతో, ఆవీధి లాయరు కళ్ళకు ఎట్లా ఉన్నదంటే, పీడకలలో కన్పించిన పాడుపట్టణములోని ఒక మారుమూల వాడవలె ఉంది. అంతేకాదు. అప్పుడాయనమనస్సులో తిరుగుచున్న ఆలోచనలు కూడా చాలా అయోమయంగా ఉన్నాయి. తన ప్రక్కనే బండిలో కూర్చుండిన పోలీసు అధికారిని చూచినప్పుడు ఆ దండనాధికారుల మూలంగా కలిగేటటువంటి మామూలు గుండెదడ కలిగింది. ఎందుచేతనంటే ఈ పోలీసుఅధికార్లు ఒక్కొక్కప్పుడు ఏమీ సంబంధం లేని వాళ్లను కూడా బంధించి నిర్బంధించి బాధిస్తారు.

చేరవలసిన చిరునామాగల యింటికి బండీ సమీపిస్తోంది. ఆ సమయంలో మంచుతెర కొంచెం విడిపోతూ విడిపోతూ ఉంది. ఒక చీకటిగొందుకంటె ఎదుట కన్పిస్తూఉన్నది. సారాదుకాణమూ, ఫ్రెంచి కాఫీ



ఆవు—దూడ

శిల్పి:— కె. సి. ఎస్. పణికర్.
[ప్రోగ్రెసివ్ పెయిన్టర్స్ ఎసోసియేషన్ (మద్రాసు) ఎగ్జిబిషన్ లోనిది.]

హోటలూ, అణాఅణాచిల్లర సరకులు రెండణాల మురబ్బాలు అమ్మే దుకాణమూ, గుమ్మముముందు గుంపుకూడిన చింపిరిగుడ్డల పిల్లలమూకలూ, ఉదయం వేళ ఒక కప్పు వేడివేడిది తాగివద్దామని బయటకు బయలుదేరిన నానాజాతుల వనితలూ యివన్నీ కన్పించాయి. ఇంతలోనే మంచుతెర తిరిగీ దట్టంగా గోధుమరంగు బురఖాలాగున ఆవరించింది. ఆమురికె పరిసరప్రదేశం కంటికి కన్పించకుండా పోయింది. అక్కడే హెన్రీ జెకిల్‌గారి ఆప్తమిత్రుని యిల్లు— రెండున్నర లక్షల సవరనుల ఆస్తికి ఉత్తరాధికారి కాబోయే ఆప్తమిత్రుని యిల్లు.

తెల్లగా ముగ్గు బుట్టవలె తల నెరిసి, దంతం భరిణలాంటి ముఖంగల ముసలి దొకతె వచ్చి తలుపు తెరచింది. తెచ్చిపెట్టుకున్న కపటమర్యాదలు చూపించిందిగాని దాని ముఖంలో దుస్స్వభావం ఉంది. పైకిమాత్రం చాలా తియ్యగా మన్ననగా మాట్లాడింది. "అవును యీయిల్లు హైడ్ గారిదే కాని ఆయన యింట్లోలేరు. ఎక్కడికో వెళ్లారు. గతరాత్రి ఆయన యింటికి రావడమే చాలా ఆలస్యంగా వచ్చారు. కాని, తిరిగీ మరొక గంటలోనే వెళ్లిపోయినారు." అని ఆముసలిది చెప్పింది. అవును అందులో వింత విశేషమేమీ లేదు. ఆయన కట్టు

(42-వ పేజీ చూడండి)

# పోటీలో నా కథ

లోగడ ఆంధ్రపత్రిక (వారపత్రిక)లో దసరా సంచికకు పిల్లలకు కథల పోటీ పెడుతున్నామని ప్రకటించబడింది. ఆ ప్రకటన చూశాను. అందులోని నిబంధనలన్నీ ఒక్క అక్షరమైనా వదలకుండా చదివాను. అన్నీ నాకు అన్వయించాయి. ఒక్కటి మాత్రం (అంటే ఒక్క నిబంధనే) సరిపడలేదు. అదే చాలా ముఖ్యమైనది. దానిమీదే ఆధారపడి ఉంది నాకథ అంతా. అది చెబితే మీరు నవ్వేస్తారేమో!—అయినా చెప్పేస్తా. వినండి! ఉఁ! వింటున్నారా చెప్పనా! ఏమిటంటే "కథలు వారి సొంత రచనలై ఉండాలి" అనే వాక్యం చూచేటప్పటికి కడుపులో తిప్పినంత పని జరిగింది. ఎంచేత అంటే - నేను సొంతంగా కథలు వ్రాయటం గాని, బొమ్మలు గీయటంగాని చెయ్యలేను. పోనీ పద్యాలు రాయగలనా అంటే "ఉట్టికి ఎగరలేనిది, స్వర్గానికి ఎగరబోయిందిట" అన్నట్లుగా గద్యరచనలో పూజ్యమైన నేను, పద్యరచనలో అసలు అడుగు పెట్టలేను. ఇక కర్తవ్యమేమిటీ అంటే, కథావస్తువులు ఎవరిదగ్గర నుంచైనా సేకరించటం మొదలెట్టాలి. ఎట్లా చెప్పండి! నాకు తెలుసున్న అమ్మమ్మ కథల్ని తెలివి ఉపయోగించి కాగితం నలుపు చెయ్యలేను. అంత యింగితజ్ఞానమే ఉంటే, థర్డ్ ఫారమ్ మొదటి సంవత్సరమే ప్యాసు అవుదును.

అసలు క్రిందటి పోటీకే నాకథని పంపదల్చుకున్నాను. కాని కొన్ని అనివార్య కారణాల చేత అందులో పాల్గోలేకపోయాను. జరిగిన సంగతి అంతా చెప్తాను. అప్పుడు కూడా యిల్లాగే ప్రకటన చూశాను. కాని ఒక్క కథాకూడ నాబుఱ్ఱకి తోచలేదు. చివరికి అమ్మమ్మచేత చెప్పించుకొని, ఆ కథ అమ్మమ్మ నోటివెంట ఎల్లా వచ్చిందో అల్లాగ తూచతప్పకుండా కాగితం మీద రాస్తే, ఆ వాక్యాల్లో కర్త, కర్మ, క్రియలు గల్లంతు. మా బావ పెద్దరచయితల్లో లెక్క కదా, వాడిచేత దిద్దించుకొని, పంపుదామని వాడి దగ్గరికి వెళ్లాను. వెడితే!—వాడు నిప్పు తొక్కిన కోతిలాగ కస్సుమంటూ, మీదికి లేచాడు.

"థర్డ్ ఫారమ్ రెండేండ్లు ఫేలు అయ్యావ్! నీ మొఖానికి తోడు పోటీకూడానా?" అని గదిమాడు. నాకు ఒళ్ళు ఆవకాయ ఊటలో ముంచినట్లయింది. కాని నా అవసరము కదూ. నోరు మూసుకొని ఊరుకొన్నాను. తనే కాబోలు! పెద...కథలు వ్రాసి అన్ని పత్రికలకీ పంపించటం! మొన్న నాన్న మా బావతో చెప్తుంటే విన్నాను. వాడు పోస్టాఫీసులో కవర్లు, స్టాంపులూ కొనటానికే నెలకి 8-0-0 అవుతున్నాయిట! తనకే కదా నాన్న తిట్టకుండా ప్రతినెలా ఎనిమిది రూపాయలు యిస్తున్నారని వెధవ గొప్ప! ఆఖరికి దొంగచాటుగా మా రాజా బావ కాల్చే కత్తిరమార్కు సిగరెట్లు తెచ్చి యిచ్చి, వాడిచేత నాకథ దిద్దించుకొన్నాను. "ఆ! ఈకథ నెగ్గుతుందా ఏమిటి!" అని విసుక్కుంటూనే దిద్దిపెట్టాడు. అందులో ఎట్టిపిరాకలు చేసినపనే ఎక్కువ. మొదట నేను వ్రాసిన వాక్యాలు ఏవీ? చచ్చీ చెడి తెల్లకాగితం మీద ఎక్కించాను.

మా నాన్నగారి దగ్గరికి వెళ్ళి "నాన్నా..." అని నసిగాను. ఏ కళలో వున్నారో "ఏం అమ్మా" అన్నారు. "నాకో బేడ యివ్వవూ?...కవరు కొని ఆంధ్రపత్రిక పోటీకి కథ పంపిస్తాను" అన్నాను. ఒక బేడ కాసు నాముఖాన పడేశారు. తీరా ఆరచన కవర్లో పెట్టి పోస్టుచేసి యింటికి తిరిగివచ్చి నిశ్చింతగా పాత పత్రిక తిరగేస్తుంటే గుండె ఆగిపోయినంత పనయింది. ఎంచేత అంటే—పోటీలు అందవలసిన తేదీ దాటిపోయి పదిరోజులయింది. ఆవడలా ముఖం పెట్టేశాను, ఆపత్రిక చూస్తూ. "కుక్క దొరికితే కఱ్ఱ దొరకదు. కఱ్ఱ దొరికితే కుక్క దొరకదు. రెండూ దొరికితే అది రాజు కుక్కట" అల్లా అయింది అప్పుడు......

అంచేత ఈ సారైనా తొందర

ఠగా కథ పంపిద్దా మనుకొన్నాను. పెందరాళే ఏదో కథను ఎంచి, రాసిపంపటం మంచిది. మళ్ళీ ఏకథ రాయనా అని ధర్మసందేహం. అసలు కథ రాయటం నాకు చేతనయితేగా. ఈ ఆలోచన్లతో ఒక రోజు గడిచిపోయింది. మర్నాడు పొద్దున కాఫీ తాగుతూ ఉండగా బలే ఆలోచన తట్టింది.

ఆ ఆలోచన ఆచరణలో పెట్టడానికి మధ్యాహ్నం తగిన సమయం అనుకొన్నాను. మధ్యాహ్నం భోజనాలు తర్వాత అందరూ నడుం వాల్చారు. మా బావకూడా తనగదిలో గుర్రుపెట్టి నిద్దరపోతున్నాడు. అటు, యిటు చూసి గదిలో ప్రవేశించాను. బావ డ్రాయరు తెరిచాను. కాదు రాసే కథలన్నీ దాచేకవరు పైకి లాగాను. అందులోంచి కాగితాలు బయటికి లాగపోయాను. ఇంతలో మాబావ "యిస్సు" మంటూ కదలి అదృష్టవశాత్తూ అటు తిరిగి పడుకొన్నాడు. ఇక భయం లేదనుకొని, నాకు నచ్చిన కథ ఒకటి తీద్దామనుకొన్నాను. అనుకోడం ఏమిటి? తీసేశాను. పూర్తిగా చదవడానికి టైము ఎక్కడ ఏడ్చింది. అంచేత హెడ్డింగ్ బాగున్న కథ తీయడానికి నిశ్చయించుకొన్నాను. 'అభాగ్యజీవి' అనేకథ బాగా ఉన్నట్టు తోచింది. విషాదాంత కథలకి ఎక్కువ ప్రాముఖ్యత అని, అది బాగుంటుందని దాన్నే ఏరి, మిగిలిన కథలు ఆ కవరులో పెట్టేశాను. డ్రాయరు మూసివేసి మా నాన్న గదిలోకి వెళ్లా. ఆయన పెన్ను తీసి, మాజానకి పుస్తకాల్లో తెల్లకాగితాలు చింపి, డ్రాయరు దగ్గరకు వచ్చి, ఆ కథని కాపీచెయ్యటం మొదలెట్టాను. మొదట రెండు పేరాలు బాగానే నడిచాయి. దాని తర్వాత కథలో ప్రేమ వ్యవహారాలు ఎక్కువైపోయాయి. ఏవేవో



# పోటీలో నా కథ

కలువపూలుట, చకోరపక్షులుట... వెన్నెల విసినకర్రలు... ఏమేమో వ్రాశాడు మాబావ. నాకు ప్రేమ కథలంటే ఒళ్లుమంట! ఇంతసేపూ కష్టపడితే ఈపెధవకథా...నాచేతికి వస్తే అని, డ్రాయరు తెరచి, అది పడేసి యింకోక కథ తీశాను. దాని పేరు "పరీక్ష చదువులు". ఇందులో ప్రేమ ఉండదు. "హాస్యకథానిక" అని పైనరాసి ఉంది కనక. అందుచేత యిదే బాగుంటుంది అనుకొన్నా. వెనకరాసిన కాగితాలు చింపి, మంచి కాగితాలు తీసికొని రాయ బోయాను. దానియిల్లు బంగారం



బడికి

చిత్రకారిణి:—మట్టిగుంట కస్తూరిబాయిగాంధి (8); రాజమండ్రి.

కాను! పెన్నులో యింకు అయిపోయింది. డ్రాయరు అంతా వెతికి అన్నయ్యపెన్ను దొరికితే అది తీశాను. దాంతో మొదలెట్టాను. సరే! అందులో "కా" ఉంటే "కా", "కి" ఉంటే "కి" ఎక్కించేశాను. సరిగ్గా సగంలోకి వచ్చేటప్పటికి కథ అక్కడనుంచి లేదు. అరె! కథ పూర్తవలేదే! వాడు పూర్తిగా వ్రాయలేదన్న మాట; సగంవ్రాసి మానేశాడు నేను ఆ కథ పూర్తిగా ఉందనుకొని దాన్నే ఏరి, కాపీ చెయ్యటానికి లంకించుకొన్నాను. తీరా చేసేటప్పటికి యిల్లా అయింది. "అంతపనీ చేందుకురా బాబూ! రెండుసార్లుకూడా యిలా అయిందేమిటా" అని అనుకొంటుంటే "ఏమిటే చేస్తున్నావ్! వాడి పెన్నుకూడా తీసి తగలేస్తున్నావా? వీపు బద్దలయిపోతుంది" అంటూ బావ (ఎప్పుడు లేచాడో) వీపుమీద చరిచాడు

"దెబ్బ దేవేంద్రలోకం చూపించింది... ఆపెన్ను కాగితాలు అక్కడ పడేసి అమ్మ కాఫీ కాస్తుంటే ఆవిడదగ్గరకు వెళ్లి గొల్లుమన్నాను. ఆవిడ ఓదారుస్తోంది. నాన్న అన్నాడు" అమ్మా ఏకార్యమైనా చెయ్యొచ్చుగాని సాహిత్య చౌర్యం చెయ్యకూడదు. అయినా కాని శ్రీనూ! అదేమిటి! అల్లా కొట్టావు నెమ్మదిగా చెప్పకూడదా" అని. మాబావ ఒక చిరునవ్వు మాత్రం విసిరాడు. మా అమ్మ ఆ రోజు నాకాఫీకోటా పెంచిందింది

ఆ రాత్రి నా కథకే [illegible] బహుమతి వచ్చినట్లు కల [illegible]ంది. ఆనందంలో లేస్తే నేను [illegible] పక్కనపడుకునివున్నాను గడియారం "డంగ్ డంగ్" మని 6 కొట్టింది ★

# ఆరోజుని

**అద్దంకి మాధవశాస్త్రి**

ఆ రోజుని సెలవు. స్నానపానాదులు ముగించి, ఇంట్లోనే కూర్చున్నా. ఎక్కడికైనా పోదామంటే ఇంట్లో కదలనీయరు. అయినా, ఈ పెద్దవాళ్లకేమిటో! సెలవుల్లో కూడా చదువుకోమనే గోల! మామూలు రోజులలో చదివింది చాలదూ? ఆరురోజులు చదివాక, విశ్రాంతిగా ఒక్కరోజు కూర్చుంటే ఆరోజునికూడా చదువేనా? మేష్టర్లుకూడా 'పెద్దవారే' కాబట్టి తమ జాతివారు వేపుకు తిన్నట్టే తామూ, హోమ్‌వర్క్ ఇత్యాదులచేత మనని బాధిస్తారు! మా లెక్కల మేష్టారు మంచివారు కాబట్టి సరిపోయింది, లేకపోతే మేము చచ్చేవాళ్లమే!

ఒక గర్జన వినిపించింది. ఆలోచనాప్రపంచాన్ని దాటి భూలోకంలో పడ్డాను. మా నాన్నారంటున్నారు: "ఏం చేస్తున్నావ్ రా, దొంగవెధవా? ఇలా సంగసాచిలా కూర్చుంటే నీకు చదువేం వస్తుందిరా? ఆ ప్రక్కింటి భీమేశ్వరావుని చూడు, ఎంతెలా చదువుకుంటున్నాడో, అతన్ని చూచి సిగ్గుతెచ్చుకో." గొంతు నెప్పెట్టిందేమో, ఇంక మా నేసి తన 'వర్క్'లో ఉండిపోయారు. నాకు ఏడుపు వచ్చినంత పనయింది. లేకపోతే ఎవడో పుల్లయ్య చదువుతున్నాడని నేనూ చదవడమేమిటి? పులినిచూచి నక్క వాతెట్టుకుందిట. వాడేదో రాక చదువుకోంటోంటే, వచ్చిన నన్నుకూడా చదవమనడం దేనికి? ఒకసారి మా మేష్టారు భీమేశ్వరావుని తిట్టారుకూడా, 'చవట వెధవా' అని. మరి నన్నెప్పుడూ తిట్టలేదు.

ఇలా గనుకుంటూ, చేతికందిన సైన్సుపుస్తకం దగ్గరేసుకు కూర్చున్నాను. పోనీ, అలాగా చదువుకోనిస్తారా? అబ్బే! "పైకి చదవవోయ్, వెధవాయ్! ముత్యాలు రాలిపోవు" అని మళ్లీ కేక. నాకాయన్ని నమలి మ్రింగేద్దామన్నంత కోపం వచ్చింది. నా మానాన్ని నన్ను చదువుకోనీయక మళ్లా ఈ గొడవేమిటి? కాని తప్పదుగా! అందుచేత మొదలుపెట్టా!

"మనము బ్రతుకుటకు ఆహారము అవసరము. దీనిని 4 విధములుగ విభజించిరి........"

పోనీ, అలాగైనా చదవనిచ్చారూ?" అంత గట్టిగా నేమిట్రా, కొంచెం నెమ్మది" అని మళ్లీ అభ్యంతరం. నాకీమాటు నిజంగా ఏడుపు వచ్చేసింది. ఏడుపు గొంతుకతోనే చదువుతున్నా, మెల్లిగా.

ఇంతలో మా అమ్మవచ్చి మా నాన్నార్ని భోజనానికి పిలిచింది. నా 'ఏడుపుచదువు' విని, ఆవిడ, "వెధవకి చదువుపేరు చెపితే నే ఏడుపు, ముక్కుమీదనే ఉంటుంది నీటికుండ" అన్నీ, తన మానాన్ని తను పోయింది.

హుఁ! నీటికుండ ముక్కుమీద నుంటుందట! వాళ్లకో? కోపం ముక్కుచివరనే ఉంటుంది! అందుకనే నన్ను మాటిమాటికీ తిడుతూంటారు, అనుకొన్నా నొకసారి. మా నాన్నారు భోజనానికి వెళ్లారు.

ఇంతలో మా చిన్నితమ్ముడు ఏడ్చాడు. ప్రతిరోజూ వాడి ఏడ్పునుచూసి విసుక్కునే నాకు ఆరోజుని అది ఘంటసాల సాంగ్ లాగ వినిపించింది. వెంటనే నేను వాడిని తీద్దామని లేవబోయాను. ఇంతలో మా అమ్మే కేకేసింది. 'వాడిని తీయరా' అని. సరే ఆడబోయిన తీర్థ మెదురైనట్లుందని, వెళ్లి వాడిని ఊరొక్కబెట్టేవంకతో ఎత్తుకొని అవతలకు తీసుకుపోయా.

## ★ ఆ రోజుని ★

వాడు ఏడ్పు మానినప్పటికీ, ఇంటి కెళ్తే చదవవలసి వస్తుందని అక్కడే వాడిని తిప్పుతూ ఒక పావుగంటకి ఇల్లుచేరా. ఈలోపున మానాన్న గారు భోజనంచేసి ఇవతలకొచ్చారు. ఇంకొక అయిదునిమిషాలలో ఆఫీసుకు పోతారు. తరవాత నన్ను చదవమని అడిగేవాళ్లుండరు.

అందుచేత, ఆ కాస్తసేపూ, బుద్ధిమంతుడల్లే కూర్చుని, పైకి దీక్షగా మృదుమధురస్థాయిలో చదువు మొదలెట్టాను. నా "భక్తి" తెలుసునేమో, ఆయనకి, పదిలెక్కలు "హోమ్ వర్క్" ఇచ్చి మరీ పోయారు. నాకు చచ్చినంత పనయింది.

మా అమ్మ భోజనానికి పిలిచింది. వెళ్లి కానిచ్చి వచ్చా. ఓ! ఇంక మనకి స్వేచ్ఛ! ఆవిడ నాన్నగారితో "రిపోర్టు" ఇవ్వకుండా పుస్తకం ముందరేసుకుని కూర్చుంటే చాలు. కాని నాన్నగారు ఇచ్చిన లెక్కలు చేయద్దూ!

మెల్లిగా లెక్కలు ముందరేసుకుని కూర్చున్నా. అన్ని లెక్కలూ వచ్చేశాయికాని రెండు రాలేదు. వాటికి మెల్లిగా ఆన్సర్లు కిట్టించి

వేసేశాను. ఇంక హాయి! నన్నెవరూ అడగరు.

ఎక్కడికైనా పోదామనుకున్నాను. కాని అమ్మ పంపించదు. అంచేత ఏదో మస్కాకొట్టాలి. రామూగాడి ఇంటికిపోతే ఏదైనా చేసుకోవచ్చు. వాడింట్లో ఎంత అల్లరిచేసినా తిట్టరుకూడా. "లెక్కలు చేసుకోవాలి" అనే వంకతో బయలుదేరి వాడింటికి వెళ్లాను.

నన్ను చూడగానే వాడు వచ్చి లోపలకు తీసికొని వెళ్లాడు. వాడికొక ప్రత్యేకమైన గది ఉంది. అందులో కూర్చున్నాం. వాడింట్లో సినిమా వేయడానికి అన్నీ ఉన్నాయని వాడే చెప్పాడు ఒకసారి. అందుచేత ఆవిషయం నేనే కదిపాను. సరేనన్నాడు. ఒక అద్దం తెచ్చి ఎండలో సూర్యుడికి ఎదురుగా పెట్టి, ఆవెలుగుని గోడమీద పడేటట్లు చేశాడు. భూతద్దం వెనకాల ఫిలింముక్కలు పెట్టి గోడమీద బొమ్మలువేశాడు. బలే సరదాగా ఉంది. ఇలాగ మా ఇంట్లో చేసుకోనిస్తేనా, అనుకున్నాను. ఆలస్యం అయితే అమ్మ తిడుతుందని పోతానని చెప్పి వచ్చేశాను.

ఇంట్లో అడుగు పెట్టేటప్పటికి 'ఘుమఘుమ' వాసనలు కొడుతున్నాయ్. తీరాచూస్తే ఎప్పుడూ టిఫిన్ చేయని అమ్మ ఆరోజుని మైసూర్‌పాక్ చేస్తోంది. అబ్బ! అదంటేనాకు బలే ఇష్టం. ఆవిడ నన్నుపిలిచి "నువ్వు బాగా చదువుకుంటే నీకు ఎక్కువ పెడతా" నంది. చంకలు గుద్దుకుంటూపోయి, మైసూరుపాకుమీది భక్తి కొద్దీ చదువు మొదలుపెట్టాను. అప్పుడు 'వినాయకుడిమీద భక్తా, ఉండ్రాళ్లమీద భక్తా' అనే సామెత జ్ఞాపకం వచ్చింది. నవ్వుకున్నా. మా అమ్మ వచ్చి ఇన్ని మైసూరుపాకులు ప్లేట్లోతెచ్చి నాదగ్గర పడేసింది. శుభ్రంగా అవన్నీ తినేసి మళ్లా 'ముక్కుబడి చదువు' మొదలు పెట్టాను.

సాయంత్రం అయినా ఇంకా చదువుతూండడంచూసి మాఅమ్మ, "పాపం! ఇంకేం చదువుతావురా, లేనాయనా! పోయి ముఖం అదీ కడుక్కుని మంచి బట్టలేసుకుని కూర్చో, ఎక్కువచదవడం మంచిది కాదు" అంది. అప్పుడు నాకా విడని ఎలా పూజించాలో తెలియలేదు. వెంటనే ఆవిడ ఆజ్ఞానుసారం ముఖప్రక్షాళనం చేసి, మంచి బట్టలేసుకుని కూర్చున్నా.

అయిదు అయ్యేసరికి మా నాన్నారు వచ్చేశారు. నాకు ఆశ్చర్యం వేసింది. ప్రతీరోజూ ఏడు దాటితేనే కాని రాని ఆయన, ఈ రోజున ఐదింటికే వచ్చారు మరి! రాగానే "లెక్కలన్నీ చేశావా?" అన్నారు. "ఆఁ!" అని పుస్తకం ఆయన కిచ్చాను. పోయి మంచి నీళ్లు తెమ్మన్నారు. దానికోసం లోపలికి వెళ్లగానే అక్కడ మా అమ్మ అప్పుడే వంటంతా సిద్ధంచేసి బట్టలుకట్టుకుని తయారై కూర్చుంది. మా తమ్ముడికి కూడా 'మేకప్' చేసింది. నాకు అదంతా అయోమయం లాగుంది. వెళ్లి మంచినీళ్లు నాన్నారికి ఇచ్చేసరికి ఆయన శుభ్రంగా ముఖం కడుక్కుని బట్టలేసుకుంటున్నారు. గ్లాసుఖాళీచేసి, ఆయన, "ఒకరిక్షా పిలు" అన్నారు. నేను పిల్చా. అమ్మను, నన్ను అందులో ఎక్కమని, రిక్షావాడితో ఏదోచెప్పి, తాను సైకిలెక్కి వెళ్లిపోయారు. ఆరిక్షావాలా మమ్మల్ని సినిమాహాలువద్ద వదిలాడు. మా నాన్న గారప్పుడే టిక్కట్లుకొని రెడీగా ఉన్నారు. రిక్షావాడిని డబ్బులిచ్చి పంపించేశారు. అందరం సినిమా చూశాము.

రాత్రి ఇంటికివచ్చాం. భోజనం చేసి పడకేశాను. మా అమ్మా, నాన్నార్ల కబుర్లు వినిపించాయ్. అమ్మంటోంది నేను బాగా చదివాననీ, తాను మైసూరుపాకు చేసి పెట్టాననీ. మానాన్నగారు నేను లెక్కలు బాగా చేశాననీ, మా మేష్టారు తనతో నేను మంచివాడినన్నారనీ చెప్పారు. నాపుట్టినరోజుకి మంచిబట్టలు కొన్నానని అమ్మకి చూపిస్తున్నారు. పక్కమీదినించే నేనూ చూశా. చాలా బాగున్నాయి. మా అమ్మా, నాన్నగారూ చాలా మంచివారనుకున్నాను. అలాగే మైసూరుపాకు, సినిమాలని తల్చుకుంటూ నిద్రపోయాను, ఆరోజుని. ★



# మనిషిలో మనిషి



(35-వ పేజీ తరువాయి)

తరచు యింట్లో ఉండడు. ఎందుచేతనంటే ఆ మున...బాలిన క్రమమైన అభ్యాసాలు కలవాడు కాదు. లిది చెప్పినమాటలనుబట్టి ఆయనను ఆ ముసలిది

న్నానే చూచింది కాని అంతకుముందు రెండు నెలల యీ మధ్యకాలంలో ఎవ్వరూ చూడలేదు.

"సరే - మంచిదే - ఒకసారి ఆయన ఉండే గదులు మేము చూడాలి" అని లాయరు అన్నాడు. అటువంటిపని సాధ్యపడదని ఆమునలిది అనబోతూఉండే సమయంలో లాయరు అందుకొని, "నావెంట వచ్చిన యీయన ఎవరో తెలుసుకో - నేర పరిశోధనలు చేసే పోలీసుశాఖలోని ఇనస్పెక్టరు అయిన న్యూకామెన్‌గారు యీయన" అన్నాడు.

ఆమాటకు ఆస్త్రీముఖంలో సంతోషం కన్పించింది. కాని ఆ సంతోషంలో విద్వేషంకూడా ఉంది. "చిత్తం-అట్లాగా! మాయజమానిచిక్కులలో పడ్డాడన్న మాట! అయితే, ఆయన ఏంచేశాడు? అన్నది ఆమె.

అట్టర్సనున్నూ, పోలీసు ఇనస్పెక్టరున్నూ ఒకరి ముఖం ఒకరు చూచుకొన్నారు. "ఇతని సంగతి చూస్తే ఎవ్వరికీ నచ్చినవాడల్లే లేడు." అని పోలీసు అధికారి అట్టర్సనుతో అన్నాడు. ఆమె వంక తిరిగి "ఇటు చూడు మునలమ్మా! ఈ ప్రదేశం నలువైపులనూ నేనూ నామిత్రుడూ చూడాలి కనుక మమ్మల్ని లోపలికి వెళ్ళనియ్యాలి" అన్నాడు.

ఆ యింటిలో ఆ మునలమ్మతప్ప ఇంకెవ్వరూ లేరు. ఆమెకూడా లేకపోతే, యిల్లంతా ఖాళీయిల్లు అన్నమాటే—ఆయిల్లు అంతటిలో హైడ్ ఉపయోగించేవి రెండు గదులుమాత్రమే. ఈ రెండు గదులలో చాలాసొగసైన విలువగలబల్లలూ కుర్చీలూ వగైరా మేజాసామాన్లు దర్జాగా అమర్చబడి ఉన్నాయి. ఒక చిన్నగదినిండా ద్రాక్షారసం దండిగా ఉంది. బల్లమీద వెండిపళ్లెములూ, చక్కగా పరచిన సొగసైన గుడ్డలూ ఉన్నాయి. గోడకు తగిలింపబడిన చక్కనిపటం ఒకటి ఉంది. బహుశః అది డక్టరు జెకిల్‌గారు బహుమానంగా యిచ్చినదై ఉంటుందని అట్టర్సను ఊహించాడు. ఎందుకంటే జెకిల్‌కు కళాభిరుచి కొంత ఉంది. గదులలో క్రింద పరచబడిన తివాసులరంగులు కన్నుల పండువుగా ఉన్నాయి. ప్రస్తుతము గదులను పరిశీలించి చూడగా, యిటీవలనే యింతకుముందే, చాలా హడావుడిగా సోదా చేసినట్లు వస్తువులు కొన్ని చిందర వందరగా ఉన్నాయి. దుస్తులు నేలమీద పడి ఉన్నాయి. చొక్కాలజేబులు ఉల్టాసీదాగా లోపలి వైపు పైకి తిప్పబడ్డాయి. బల్ల సొరుగుల తాళాలు తీయబడి తెరువబడినాయి. అక్కడ ఉన్న సెగడువద్ద కాగితాలుకాల్చిన బూడిద ఉంది. ఆ బూడిదలో బ్యాంకు చెక్కుపుస్తకం తాలూకు పూర్వార్థభాగాల పొత్తి ఒకటి తగలబడకుండా పడిఉండటం చూచి, దానిని పోలీసు ఇనస్పెక్టరు పైకితీశాడు. విరిగిన చేతికర్ర తాలూకు రెండో అర్థభాగం తలుపునందున ఉంది. ఈ కర్రముక్క దొరకడం మూలంగా ఆ పోలీసుఅధికారి అనుమానాలు పూర్తిగా బలపడ్డాయి. అందువల్లనే అది దొరికినందుకు చాలా సంతోషభరితుడైనాడు. ఖూనీచేసినవాని బ్యాంకుఖాతాలో అనేక వేల సవరనుల మొత్తం నిల్వ ఉన్నట్లుగా కన్పిస్తోంది. కనుక బ్యాంకుకుకూడా వెళ్ళి విచారించవచ్చుననే ఆశతో పోలీసుఆఫీసరుకు పూర్తిగా సంతృప్తి కలిగింది.

ఆ కారణంచేత. అట్టర్సనుగారితో పోలీసు ఆఫీసరు యిలా అన్నాడు. "బాబూ! ఇక నాదీ హామీ. ఈ మనిషి నాచేతులలో చిక్కాడు. అతనికి బహుశః బుర్రపోయింది. అలా కాకపోయినట్లయితే, యీ కర్రముక్క సగ డిక్కడ విడిచిపెట్టి ఉండడు. అంతకంటే ఎక్కువైన దేమిటంటే, యీ బ్యాంకు చెక్కు పుస్తకమును తగులబెట్టేవాడు కాడు. ఏమనిషికైనా పైకంతోనే బ్రతుకు—ఇక మనం చేయవలసింది ఏమీలేదు. బ్యాంకువద్దకు వెళ్ళి, అతని కోసం కనిపెట్టుకుని ఉండి, అతడు తీసికొనివచ్చే బ్యాంకు చెక్కులను పట్టుకోవాలి.

ఈ చివరిపని అంత సులభసాధ్యమైనదికాదు. ఎందుచేతనంటే, హైడ్‌తో బాగా ముఖపరిచయం గల్గిన వాళ్లు చాలా కొద్దిమంది మాత్రమే ఉన్నారు. పైచెప్పిన మునలిపనికత్తెయొక్క పెనిమిటికూడా అతనిని రెండుసార్లే చూచియున్నాడు. హైడ్ సొంత కుటుంబం వారెవ్వరూ ఎక్కడా కన్పించడంలేదు. అతని ఫొటో ఎన్నడూ తీయబడినట్లుగా లేదు. అతనిని వర్ణించి చెప్పగల కొద్దిమందికూడా లోకసహజంగా పరిపరివిధాలుగా వర్ణిస్తున్నారు. కాని ఒక్కవిషయంలో వీరందరూ ఏకీభవిస్తున్నారు. అది ఏమిటంటే, స్పష్టంగా వివరించడానికి వీలులేని ఒక విధమగు అనిర్వచనీయ వికృతత్వం అతన్నిచూచిన వారికందరికీ అతనిలో కన్పించింది.

(ఇంకా వుంది)



అశ్వరాజ్ ప్రొడక్షన్స్ వారి "అన్నదాత" లో కళ్యాణిగా నటిస్తున్న అమ్మాజీ.

ఈస్టిండియా ఫిలింకంపెనివారి "పక్కింటి అమ్మాయి"లో అంజలీదేవి.



ది సినీకావారి "పెళ్ళిపిల్లలు" (24 గంటలలో జరిగిన రచన)లో కృష్ణవేణి, జానకి, నాగరత్నం.



# తాపీ ధర్మారావుగారికి మదరాసులో సన్మానం

ఈ నెల 13 వ తేదీన చెన్నపురి ఆంధ్ర విద్యార్థి విజ్ఞానసమితివారు తాపీ ధర్మారావు నాయుడుగారిని సన్మానిస్తూ, సెంట్ మేరీస్ హాలులో సభ ఏర్పాటుచేశారు. సభకు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు అధ్యక్షత వహించారు. సమితి అధ్యక్షులు బి. లక్ష్మణరావుగారు మాట్లాడుతూ నాయుడుగారు ఆంధ్ర భాషకు చేసిన బహుముఖ సేవను ఉగ్గడించి అభినందన పత్రం సమర్పించారు.

సభాధ్యక్షులు కృష్ణశాస్త్రిగారు మాట్లాడుతూ, ధర్మారావునాయుడుగారిని గౌరవిస్తున్నందుకు విద్యార్థులను అభినందించారు. ఆయన యాభై యేళ్ళుగా ఆంధ్ర సారస్వతానికి అమోఘమైన సేవ చేశారనీ, ఆయన స్వయంగా కవిత్వం రచించడమేగాక విమర్శనం, పరిశోధనం, పత్రికా సంపాదకత్వం, పత్రికా రచనం మున్నగు రంగాల్లోనూ ఎంతో కృషిచేశారనీ, సినిమా రచయితగా కూడా అనేక సంవత్సరాల నుండి పరిశ్రమిస్తూన్నారనీ శాస్త్రిగారన్నారు.

తరవాత వివిధ కళాశాలల విద్యార్థులు నాయుడుగారికి పుష్పమాలలు వేశారు. శాలువ, తాంబూలం మున్నగునవి సమర్పించబడినవి. శ్రీశ్రీగారు మాట్లాడుతూ, మొదట్లో నాయుడుగారు గ్రాంథిక భాషావాదిగా వున్నా తరవాత వాడుక భాషావాదానికి మారి సారస్వతానికి మహోత్కృష్టమైన సేవ చేశారన్నారు. ఆరుద్ర, అనిశెట్టిగార్లు మాట్లాడుతూ నాయుడుగారి అభ్యుదయ దృక్పథాన్ని ఉగ్గడించారు. విద్వాన్ విశ్వం గారు నాయుడిగారి ఆత్మకథ పూర్తయేలాగ చేయవలసిన భారం విద్యార్థులు వహించాలన్నారు.

నాయుడుగారు సన్మానానికి సమాధానమిస్తూ తెలుగువారిలో భాషాభిమానం, సారస్వతాభిరుచి పెంపొందింప జేయడమే తమ జీవితలక్ష్యమని తెలిపారు.

తరవాత డి. రాధ నృత్యం చేసింది. తరవాత ఏకాంక నాటకాలు ప్రదర్శింపబడినవి. సభ జయప్రదంగా ముగిసింది. ★

# ఎస్. ఎస్. వాసన్‌గారికి సన్మానం

## కలర్ లాబొరేటరీల స్థాపించాలని సూచన

"అవ్వయ్యార్" నిర్మాత ఎస్. ఎస్. వాసన్‌గారికి ఈ నెల 16 వ తేదీన మద్రాసులో, అన్నామలై మందిరంలో తమిళ ప్రముఖులు, కొందరు ఆంధ్ర ప్రముఖులు కలిపి సన్మానం చేశారు. ఈ సభకు సర్ సి. పి. రామస్వామి అయ్యర్ అధ్యక్షత వహించారు. మద్రాసు ముఖ్యమంత్రి రాజగోపాలాచారిగారు కూడా వచ్చి వేదికపై సుఖాసీనులయ్యారు. నగరంలోని ప్రముఖులనేకులు సభకు హాజరయ్యారు.

అహ్వాన సంఘాధ్యక్షుడు మద్రాసు మేయరు చెంగల్వరాయన్ "అవ్వయ్యార్" చిత్రం తమిళులంతా గర్వించదగిన చిత్రమనీ, కళాదృష్ట్యా, టెక్నికల్‌గా ఫోటోగ్రఫీ దృష్ట్యా, నైతికంగా, సంగీత, సాహిత్య పరంగా యీ చిత్రం సాటిలేనిదన్నారు.

మద్రాసు గవర్నరు శ్రీ ప్రకాశ, మంత్రులు సి. సుబ్రహ్మణ్యం, కె. వెంకటస్వామి నాయుడు, ఇంకా అనేకమంది వాసన్‌గారికి పంపిన సందేశాలు చదువబడిన తరవాత రాజాసర్ ఎమ్. ఎ. ముత్తయ్య చెట్టియార్ మాట్లాడారు. పన్నెండేళ్ళ కిందట తాను జెమినీ స్టూడియోకు ప్రారంభోత్సవం చేస్తూ తమిళ సంస్కృతిని ప్రతిబింబించే చిత్రాలు తీయవలసిందని వాసన్‌గార్ని కోరాననీ, ఆ కోరికను వాసన్‌గారు ఇన్నాళ్ళకు నెరవేర్చారనీ అన్నారు. మద్రాసు పారిశ్రామిక శాఖామంత్రి డా॥ యు. కృష్ణరావు, పి. ఎమ్. శివజ్ఞానగ్రామణి, "కల్కి" పత్రికా సంపాదకుడు ఆర్. కృష్ణమూర్తి, నటుడు టి. కె. షణ్ముగం వరసగా "అవ్వయ్యార్"ను ప్రశంసిస్తూ ఉపన్యసించారు. సభాధ్యక్షుడు సర్. సి. పి. రామస్వామి అయ్యర్ మాట్లాడుతూ సెక్సప్పీలు, తదితర చవకబారు ఆకర్షణలు అణుమాత్రమూ లేని యీచిత్రాన్ని ప్రజలు విశేషంగా ఆదరించడం మాస్తే దేశంలో మతం, దైవభక్తి పునరుజ్జీవం పొందుతున్నాయని తనకు నమ్మకం కలుగుతోందన్నారు. తమిళనాడులోని సాంస్కృతిక నవచైతన్యానికి ఈ చిత్రం నిదర్శనమన్నారు. హాలీవుడ్ చిత్రాలు మనకు బాగా అలవాటయ్యాయనీ, ఆ చిత్రాల్లో ఎక్కువగా సెక్సప్పీలు తప్ప మరేమీ ఉండడం లేదనీ, మొదటి అయిదు నిమిషాల్లో యువతీ యువకులు ప్రేమించుకోవడం తరవాత అయిదు నిమిషాల్లో విడిపోవడం, ఇదే ఆ చిత్రాల్లో ఇతివృత్తమనీ, ఇది సంఘంపై దుష్ప్రభావం ప్రసరించే ధోరణి అనీ ఆయన నిరసించారు.

రాజాజీని మాట్లాడవలసిందని కోరారుగాని, ఆయన నిరాకరించడంచేత, వాసన్‌గారు లేచి తమకు జరిగిన సన్మానానికి కృతజ్ఞత తెలిపారు. తనకు యింతమంది మేధావులు, రాజకీయ, సారస్వత, కళావేత్తలు సన్మానం చెయ్యడం ఎంతో గర్వకారణమని చెప్పారు. తాను కేవలం సినిమా వ్యాపారస్థుడిననీ, సన్మానాలు పొందాలనే ఉద్దేశ్యంతో తాను "అవ్వయ్యార్" తీయలేదనీ అన్నారు. "ఇదివరకు నేను ఎన్నో చిత్రాలు తీశాను. వాటిలో కొన్ని యీ చిత్రంకంటె ఎంతో ఆర్థిక విజయం పొందాయి. అయినా వాటినిబట్టి నాకు సన్మానం చెయ్యాలనే అభిప్రాయం మీకెవ్వరికీ కలగలేదు. ఈ చిత్రం నేనాశించకుండానే అందరి మన్ననలూ పొందింది. రాజాజీ సైతం నా చిత్రాన్ని రెండుసార్లు కుతూహలంతో చూశారు. ఆయన చిత్రమంతా చూచి కారెక్కి నన్ను పిలిచి "*Enormous production*" (బ్రహ్మాండమైన చిత్రం) అని మాత్రం అన్నారు. ఈ ముక్క రాజాజీగారి ఆశీర్వచనంగా పరిగణిస్తున్నాను. ఆయన యిలా వచ్చి వేదికపై కూర్చోవడం కూడా నాకు ఆనందదాయకంగా వుంది," అని వాసన్ అన్నారు.

"ప్రభుత్వాలకు మేము ఏటేటా 12 కోట్ల రూపాయలు పన్నుల రూపేణా చెల్లిస్తున్నాం. అందుచేత నేనొక సూచన చెయ్యదలుచుకున్నాను. కేంద్రప్రభుత్వం మద్రాసు, బొంబాయి, కలకత్తా నగరాల్లో 'కలర్ లాబొరేటరీలు' స్థాపించాలి. దీనికి ఒకటి రెండు కోట్ల రూపాయలకంటె ఎక్కువ పట్టదు. ఈ డబ్బు ప్రభుత్వానికి తిరిగి అనతికాలంలో వచ్చేస్తుంది. సమర్థులైన నిర్మాతలు వర్ణచిత్రాలు నిర్మించగలరు. ప్రకృతి సౌందర్యానికి పేరుపొందిన భారతదేశ శోభను వర్ణచిత్రాల్లో చూపిస్తే ఎంత బావుంటుందో కేంద్రప్రభుత్వం ఆలోచించాలి. ఆ చిత్రాలు విదేశాల్లో ప్రదర్శనకు కూడా అర్హంగా వుంటాయని నా వుద్దేశ్యం," అని వాసన్ అన్నారు.





ప్రకాష్ పిక్చర్సువారి "చైతన్య మహాప్రభు" చిత్రంలో ఆఖరు సన్నివేశ సందర్భంలో తీసిన వర్కింగ్ స్టిల్: కెమేరాను ఆనుకుని కూర్చున్నది డైరెక్టర్ విజయభట్; వెనుక కెమేరామాన్ వి. యన్. రెడ్డి, అసిస్టెంట్ బిపిన్; ముందర నుంచున్నది భారతభూషణ్, తదితరులూ.



ఇటీవల విడుదలైన "పెంపుడు కొడుకు"లో గణేశన్, శ్రీరామమూర్తి, సావిత్రి.



# ఆ రోజుల్లో విన్న సంగతిమీద ఈ రోజుల్లో ఓ కల

(5-వ పేజీ తరువాయి)

ఘుట్టే!" అని జవాబుచెప్తూ పాటిమీద తన శిశువుకోసం వెమకులాడేవట!

అయితే శిశువు ఎవరిచేతనో రక్షింపబడింది అని యీవఱలోనే విన్నాం!—కాని తల్లియొడిలోకి చివరకొచ్చిందా? వస్తే ఏలా వచ్చింది? అనే రెండు ప్రశ్నలకు సమాధానం ఈ కథగుండా రాదా? అదీ నా దుగ్ధ! ఇదీ వినికిడిమీదనే సాధించాలి! పాఠకులారా ఆలకించండి!

శిశువు నోచేత్తో రక్షిస్తూ, రెండవ చేతను ఆతడే ఒక పామును శిక్షించాడు. వరదలో ఎటుచూచినా పాములే! పాములంటే జ్ఞాపకం వచ్చెని, పట్నవాసపు రేవులో ఒక రావిచెట్టు, పేద్దచెట్టు, పై కొమ్మలు మాత్రంగా మిగిలివుంది. మిగిలివున్న కొమ్మలు లెక్కిస్తేనే ఒక వంద ఏభై యున్నాయి. మునిగిన కొమ్మలుకూడా కలిపితే ఎన్నివుండేనో! పై కొమ్మల్లోకంటా ఒక పాము ఎక్కింది, తన ప్రాణం తాను దక్కించుకుందామని. ప్రజలు ఆలా దాన్ని ప్రాణంతో పోనిస్తారా? పదిమంది పది కొమ్మలకూ ఎక్కి, "పాము పాము" అని, అది ఆ కొమ్మకూ ఈ కొమ్మకూ పాకులాడుతూ వుంటే, కర్రతో నీళ్ళమీద పడేటట్టు చేసి, నీళ్ళమీద వోదెబ్బ, దాని పడగమీద వోదెబ్బ అన్నట్టు దబదబా మొత్తేశారు. ఏముంది? పాము చచ్చింది! పట్నవాసంలో రేవు కాబట్టి సులువుగా చావగొట్టారు. అదే పల్లెటప్రాంతం అయితే, పది పాములు కలిసి బరితెగినట్టు, చెరలాడి, ఒక్క పాము వేయి మెలికలు తిరిగి, మీది ప్రాణం క్రిందకు వచ్చేటట్టు చేస్తుంది ఏవానవుణ్ణాయినాసరే! అయితే నేనన్న ప్రత్యేకవ్యక్తి వున్నాడా, ఆతగాడు, సునాయాసంగా, అతిసునాయాసంగా, ఒకచేత్తో నాగుబామును చంపుతూ రెండోచేత్తో వామును రక్షించాడు గరుడుడా అన్నట్టు!

రక్షింపబడ్డ శిశువు కేరున అఱచి, కవ్వున గంతి ఒక పెట్టెలో పడ్డాడు. పెట్టెలో పడ్డాడూ అంటే దాని మూత తెఱచి వుండాలి! పెట్టె తేల్తూవుండాలి! సర్వసాధారణంగా పెట్టె నెవడైనా చేతపట్టుకు ప్రవాహంలో తేలి వస్తూవుంటే, "లాభం లేందే సెట్టి ఏటబడడు" అంటారు. కాని ఇక్కడ ఉత్తపెటే, మూతతెఱచుకు, తేలిపోతూవుంటే, శిశువు కాబట్టి లాభం చూడకుండా ప్రాభవమే చూసుకు అందులోకి పడ్డాడు. ఈ శిశువు పడ్డాడో లేదో పెట్టె మూత పడిపోయింది. శిశువుమాట పెట్టె మూతపడ్డం మాట మఱచి కొత్తమనిషి, పెట్టెలో బంగారు వస్తువు లుండివుండాల అనే అంచనాను మునిగీత ఈదేడు. పైకో గొలుసు ఒక కట్టడ కాసులపేరు గజ్జెల వొడ్డాణం గమ్మున ఎత్తేడు. అవి పైకెత్తి వాటిని మెఱయించేలో ఈ పెట్టె శిశువూ అల్లంత దూరంపోయి అదృశ్యమయినాయి!

"ట్రాక్" "రీల్" "కట్" అయిపోయినట్టు, కొంతసేపు అగమ్యగోచరంగాను, అంధకార బంధురంగాను వుండిపోయింది నాకల! నాకల నాకే నల్లగా కనబడసాగింది. మళ్ళీ కల అతుక్కోవడంలో ఒక "లేడీ డాక్టరు" కనబడింది. ఆమెకూడా జలజంతువులా నడుస్తూ వుంది నీటిలో. ఆ నీరే అనుకోవాలి ఈ నీరూను. ఎంచేతా అంటే లేడీ డాక్టరు ఎగ్గట్టు దిగుచాయను పైపెట్టె తాకినట్టయింది. అట్టే చేతిలోని స్టెతస్కోపు బుజమ్మీదకు విసురుకోని,—ఆ పెట్టె నాపి మూత తీసి చూసింది. మరో నిమిషములా వుండివుంటే ఆరోజు రోజున్నర బిడ్డ ఉక్కిరి బిక్కిరై చచ్చేది! అని ముద్దులాడి, సుద్దులాడి బుజాన్నేసుకుంది బిడ్డణ్ణి! బిడ్డడి గుండెకాయ యొక్క దెబ్బల్ని స్టెతస్కోపు దానంతటదే లెక్కిస్తూ వుంది. బిడ్డకు మరి ఫరవా లేదని జగత్తు వూహించినట్టుగా జయశంఖారావం చేసింది.

విన్న సంగతైనా నమ్మదగినదిగా వుండాలి! వెంటనే అడిగాను ఒక ప్రశ్న! "నీ వక్క డెలా గున్నావమ్మా!" అని లేడీ డాక్టర్ను. ఆమె నన్ను చూస్తూ సిగ్గు వెంటనే అభినయించింది. "లేదు సార్! నా వృత్తి సార్! అది! పురుళ్ళు పోయడం నా వృత్తి సార్" అంది. "వరదకు పురుడు పోయడం ఏమిటమ్మా?" అని పక్కున నవ్వాను. "మగవాడవు నీకేం తెలుస్తుంది ఆడవాళ్లు పడేపాట్లు?" అని ఆ లేడీడాక్టరు చిరునవ్వు నవ్వింది. "అయితే పిల్లనేం చేస్తారు? అని అడిగాను. "తల్లి తెలియనప్పుడు తండ్రి తెలియనప్పుడు "అర్ఫనేజ్"కి చేరుస్తాం" అంది లేడీ డాకరు. "అది గొప్ప సంఘసేవే" అన్నాను నేను.

ఇలా మేముద్దఱం వరదలో మోకాల్లోతు నోకరం మొల్లోతు నోకరం, ఎవరివి "హైహీల్డ్ షూస్" తెలియకుండా నిలబడి మాట్లాడుకుంటూ వున్నాం, పైన ఒక వాయు విమానం గిర్రున తిరిగినట్టయింది. ఆ వరదరోజుల్లో మహా తిరిగాయి లెండి ఆలాంటి యంత్రాలు. "ఆ వాయువిమానం నేలకు దిగి ఈ బిడ్డణ్ణి తీసికొని 'అర్ఫనేజ్'కి చేర్చకూడదూ?" అంది లేడీ డాక్టరు. "వాయువిమానంమీద వాళ్లు భూతద్దాల్తో చూడ్డానికి పుట్టారు. కాని బరువు మోయడానికి పుట్టలేదు" అన్నాను. "ఇలా లెండి బిడ్డణ్ణి" అంది తల్లి ఎక్కణ్ణుంచో! నా కళ్లల్లో ఒక మెఱపు మెఱసింది.

"నీవు ఈ పిల్లణ్ణి ఈ వరద నీట కన్నావు అంటే నాకు నమ్మశక్యంగాకుండావుంది" అంది లేడీ డాక్టరు! "బొప్పాసి చెట్టు సాక్షిగా!" అంది ఆ పురటాలు. "ఇన్ని చెట్లుండగా బొప్పాసి చెట్టునే సాక్ష్యం వేసుకుంటావేం?" అని అడిగింది లేడీ డాకరు. "అటువంటి భూజం మఱి వొకటి కానబోను!" అంది ఆ యిల్లాలు. "లేడీ డాక్టరు భుజంకూడా ఆలాంటిదే" అన్నాను నేను. "నా భుజం! నా భుజం! అదో ఎటర్నల్ అర్ఫనేజి! తల్లీతండ్రులు లేని బిడ్డలకు శాశ్వత పుట్టిల్లు!" అంది. "అది ఎట్లా" అన్నాను ఎటకారంగా ఆమెకేసి చూస్తూ! ఆమె అతివాస్తవికంగా తనకళ్లల్లోకి కాంతి నింపుకొని, "ఏ బిడ్డకు తల్లివున్నా ఏ బిడ్డకు తండ్రివున్నా, ఈబిడ్డకు మాత్రం ఎన్నడూ తండ్రిలేడు! దేవునికొడుకు ఈతడు. ఈతను జీసస్!" అని ఒక చిహ్నాన్ని తన బుజంమీద చూపించిందై "ఇతణ్ణెప్పుడూ ఈ బుజంమీద నేను మోసేను - వరదప్పుడు వానప్పుడు, వయసప్పుడు, వార్ధక్యమప్పుడు!" అంది.

"దేవుని యెడల నమ్మకం అంటే ఆలా వుండాలి!" అన్నాను వెంటనే ఎదో భావనాగరిమను ఆ లేడీ డాక్టరు కళ్లల్లోని నును కాంతి నొక్కింత మూఱగొంటూ.

కాని లోకం 'కన్నాను' అని అనదుగా! "విన్నాను" అనే అంటుంది.—"దేవుడూ లేడు దయ్యమూ లేదు. బొప్పాసి చెట్టు అప్పా! నే విన్నాను అప్పా! నీళ్లాడింది బొప్పాసిచెట్టు అప్పా!" అని లోకం అన్నట్టయింది, వరదలో కొట్టుకుపోతూ.

మేము చూస్తుంగండా! మాపాదాలక్రింద మఱి ప్రవాహంలేదు. మాంచి! మిలమిలా! మెఱసిపోయే గంధ్రిసుక జరజరామంది. నేపరున్న చోటు చోటూ జరిగినట్టయింది!

మెలకువనొన్నాను! కలను కలకాలం నిలపాలని ఈ కథ ఇలా వ్రాశాను. ★

# ప్రశ్నలు..సమాధానాలు

విజయలక్ష్మి—అవనిగడ్డ.

21-11-53 తేదీన వెలువడిన ఆంధ్ర వారపత్రిక సినిమా సెక్షనులో బెంగాలీ చిత్రాలు "సెంటిమెంటాలిజమ్"తోను, భావాలు, నిరాశతో కూడుకొని వున్నాయని, అవి హాని కలిగిస్తాయని శ్రీ శ్రీనివాసన్ గారు చెప్పారని వ్రాశారు. బెంగాలీ చిత్రాలు నాటికి నూరుపాళ్ళు "వాస్తవికత" చూపిస్తుంటే అవి సమాజానికి ఎందుకు హాని కలిగిస్తాయి?

—సమాజంలోని యథార్థ పరిస్థితులను ప్రజలు తెలుసుకోవడం కూడా తమకు హానికరమని భావించే ప్రభుత్వాలున్నాయి. యథార్థ పరిస్థితులు అధ్వాన్నంగా వున్నాయని భావిస్తే ప్రజలు అసంతృప్తులవుతారు. అసంతృప్తివల్ల ఆందోళన, అశాంతి కలగవచ్చు.

*　　*　　*

చేబ్రోలు సూర్యారావు—కాకినాడ.

సినిమాలలో "ప్రాసెసింగు" అంటే ఏమిటి?

—ఎక్స్‌పోజు అయిన ఫిలిమును డెవలప్ చెయ్యడం, సౌండు ట్రాక్సు ఫిలిమ్‌తో జోడించడం, ప్రింటు తీయడం మొదలైన పనులన్నిటికీ కలిపి ప్రాసెసింగ్ అని పేరు.

ఆంధ్రంలో మొట్టమొదటి "టాకీ" చిత్రము పేరేమిటి?

—హెచ్. ఎమ్. రెడ్డిగారు డైరెక్టు చేసిన "భక్త ప్రహ్లాద" మొదటి తెలుగు టాకీ.

*　　*　　*

పి. ముఖ్యప్రాణరావు—కవుతరం.

భర్తృహరి సుభాషితములు తెలిగించిన

(52-వ పేజీ చూడుడు)



నారథీవారి "అంతా మనవాళ్ళే"లో జగన్నాథం మామ చిదంబరంగా సి. ఎస్. ఆర్., కూతురు గిరిజగా జమున, భార్య వరలక్ష్మిగా సూర్యకాంతం, జగన్నాథంగా రంగారావు.

# సినిమా వార్తలు

నేషనల్ ఆర్ థియేటర్స్ వారు తమ రెండవ నిర్మాణంగా "తోడు దొంగలు" అనే చిత్రం తీస్తున్నారు. నిర్మాత ఎస్. త్రివిక్రమరావు; డైరెక్టరు యోగానందం; కామెరా రహమాన్; ఆర్టు తోట వెంకటేశ్వరరావు; పాటలు, మాటలు సముద్రాల జూనియర్; సంగీతం టి. వి. రాజు; నటులు ఎన్. టి. రామారావు, గుమ్మడి వెంకటేశ్వరరావు, చలం, హేమలత మున్నగువారు. వచ్చేనెల మొదటివారం సెట్స్‌కు వెడతారని అనుకుంటున్నారు.

* * *

కలకత్తాలో సి. పుల్లయ్యగారు డైరెక్టు చేసిన ఈస్టిండియా ఫిలిమ్సు వారి "పక్కింటి అమ్మాయి" తెలుగు చిత్రం పూర్తయిందనీ, వచ్చేనెల 11 వ తేదీకి విడుదల కాగలదనీ తెలుస్తోంది. అంజలీదేవి, రేలంగి ప్రధాన పాత్రధారులుగా గల యీ చిత్రం హాస్యరస భరితమై వుంటుందట.

* * *

జెమినీవారు "బహుత్ దిన్ హుయే" అనే హిందీ చిత్రం నిర్మిస్తున్నారు. తెలుగులో యిదివరకు విజయం పొందిన జెమినీ వారి "బాలనాగమ్మ" కథ దీనికి ఆధారమట. దీనిలో పుష్పవల్లి, ఎస్. కె. రాం, లలితాపావక్, కన్హయ్యాలాల్, రతన్ కుమార్, ఆగా మున్నగువారు నటిస్తున్నారు. డైరెక్టరు వాసన్ గారే.

* * *

స్వామి వివేకానంద జీవిత చరిత్రను బెంగాలీలో చిత్రంగా నిర్మించిన అమర్ మల్లిక్ అనే కథావస్తువును హిందీలో "స్వామీజీ" అనే పేరుతోనే పునర్నిర్మించనున్నారట. బెంగాలీలో స్వామీజీగా నటించిన అజిత్ ఛటర్జీయే, తిరిగి హిందీ చిత్రంలో నటిస్తాడు. ఇతనికి స్వామీ వివేకానంద పోలికలు బాగా వున్నాయట.

* * *

ది వివేకావారి "పెళ్ళిపిల్లలు" చిత్రం సగందాకా తయారైనది. ఈ చిత్రానికి దర్శకుడు పి. వి. రామశర్మ; మాటలు, పాటలు రావూరి; కామెరా పి. ఎల్. రాయ్; సంగీతం మల్లేశ్వరరావు; ఆర్టు కోటేశ్వరరావు; రేవతీ స్టూడియోలో షూటింగ్ జరుగుతోంది. జానకి, ఛాయాదేవి, రాజరత్నం, కృష్ణవేణి, చంద్రశేఖరం, నాగభూషణం, దొరస్వామి మున్నగువారు నటిస్తున్నారు.



స్వంత రిక్షా కొనుక్కునే రోజు వచ్చేనా అని ఆలోచిస్తున్న నారాయుడు.

**గోకుల్ పిక్చర్సువారి "నిరుపేదలు"లో రిక్షావాలా నాగేశ్వరరావు.**

* * *

గోకుల్ పిక్చర్సువారి "నిరుపేదలు" చిత్రంలో ఎ. నాగేశ్వరరావు, జమున, సురభి బాలసరస్వతి, కుటుంబరావు, రమణారెడ్డి మున్నగువారు నటిస్తున్నారు. డైరెక్టరు తాతినేని; కథ ప్రత్యగాత్మ; మాటలు, పాటలు అనిసెట్టి సుబ్బారావు; సంగీతం టి. వి. రాజు; కామెరా బి. ఎస్. రంగా; స్టూడియో రేవతి.

ఈ నెల 8 వ తేదీన ఢిల్లీలో జరిగిన హిందీ సినిమాతారల క్రికెట్ ఆటలో రాజకపూర్ జట్టు ఓడిపోయి, మోతీలాల్ జట్టు గెలిచింది. మోతీలాల్ జట్టు 200 పరుగులు తీయగా, రాజకపూర్ జట్టు 174 పరుగులు తీసింది. ★

## ప్రశ్నలు - సమాధానాలు

(49-వ పేజీ తరువాయి)

వేమును లక్ష్మణకవి, ఎలకూచి బాలసరస్వతి, పుష్పగిరి తిమ్మన అను ఈ ముగ్గురు కవులలో ఎలకూచి బాలసరస్వతి స్త్రీ అని నేనూ, పురుషుడని నా మిత్రుడును వాదించుకొనుచున్నాము. మా సంశయము తీర్చండి.

—ఎలకూచి బాలసరస్వతి పురుషుడే. ఆ పేరు బిరుదనామమై వుండవచ్చు.

*　　*　　*

పి. సాంబశివరావు—రాజమండ్రి.

సెంటిమెంటాలిజమ్ అంటే ఏమిటండి?

—ప్రతి చిన్న అనుభూతికీ, ఉద్రేకానికీ సులభంగా లొంగిపోయే హృదయ దౌర్బల్యంగల మనుషులను 'సెంటిమెంటల్' మనుషు లంటారు. హృదయ దౌర్బల్యాన్ని గొప్పచేసి ప్రదర్శించడం 'సెంటిమెంటాలిజమ్' అవుతుంది.

డ్రైవ్ ఇన్ థియేటరుకు, ఓపెన్ ఎయిర్ థియేటర్‌కు తేడా ఏమిటండి?

—మొదటిరకం వాటిలో ఆరుబయట ఎవరి కార్లలో వాళ్లు కూర్చుని దూరంగా తెరపై చిత్రం చూడవచ్చు. రెండోరకం వాటిల్లో ఆరుబయటనే కూర్చునేందుకు సీట్లు వుంటాయి. ఇదే తేడా.

*　　*　　*

కె. వి. శేషారావు—కటక్.

తే 11-11-53 ది పత్రికలో "పతిత" గురించి సమాధానమిస్తూ "చూచిన ప్రజలంతా బాగుందన్నా రనడానికి ఆధారం లేదు" అన్నారు. పోనీ బాగులేదు అన్నారని ఏ ఆధారంమీద తాము అనుకోగలిగారో తెలియజేయగలరా? లేక అసలు అభిప్రాయం ఎలా ఉందో తాము తెలుసుకోదల్చుకున్నారా?

—చూచిన ప్రజలంతా బాగుందని పొగిడినట్లయితే, వారి అభిప్రాయం తీసుకుని మరికొంతమంది, వారి అభిప్రాయం పాటించి ఇంకా కొంతమంది అసంఖ్యాకంగా ప్రేక్షకులు ఆ చిత్రం చూచేవారు. అంటే అది 'బాక్సాఫీస్ హిట్' అయ్యేదన్నమాట. "పతిత" చిత్రం అలా విజయం పొందలేదు. కనీసం మద్రాసులో మూడు వారాలకు మించి పోలేదు. మీకు ప్రజాభిప్రాయం కంటె విమర్శకాభిప్రాయమే విలువైనదైతే దేశంలోని వివిధ పత్రికలు ఏమి వ్రాశాయో పరిశీలించండి. ఇంతకీ మీకు అభిప్రాయ స్వాతంత్ర్యం లేదని మేమనలేదు.



## కాలక్షేపం

(4-వ పేజి తరువాయి)

ఆయువును అరికట్టవలెననే దృఢసంకల్పాల ఆత్మబలం మాత్రం చంచలం కాదు. చిన్నవాళ్ళ విషయంలో "మార్కండేయు లంత ఆయుష్షు బ్రహ్మంత ఆయుష్షు" ఉండాలనే ఆశీర్వాదం పెద్దవాళ్ళ నినాదం. పిల్లలు తుమ్మితే చాలు పెద్దవాళ్లు 'చిరంజీ' అంటారు. ఈ పాపిష్టిలోకం నుంచి వెళ్ళిపోయినవాడే అదృష్టవంతుడు అనేమాట పిల్లల విషయంలో పెద్దవాళ్లు అనడం అసంభవం. "సుకృతీ గతాయుః" అనేది అర్థం లేని వ్యర్థవాక్యంగా పరిగణించాలి. "బ్రతికియున్నాడ జీవచ్ఛవంబ నగుచు" అని విరక్తిపొందడం పండితలక్షణం కాదు. అది పెద్దనవంటి పెద్దలు అనవలసిన మాట కాదు.

"కలియుగంబున నికనుండ-గష్టమనుచు
దివిజ కవివరు గుండియల్-దిగ్గురనగ
యరుగుచున్నాడు శ్రీనాథు-డమరపురికి"

అనేమాట విషాదకరమే. "దివిజకవివరు గుండియల్ దిగ్గురనగ" (స్వర్గంలోని కవీశ్వరుని గుండెలలో దిగులు పుట్టేటట్లుగా స్వర్గానికి పోవడం కూడా అంత మంచి పని కాదు. అటువంటివాడు ఆ స్వర్గంలో మాత్రము శాంతంగా సుఖంగా అక్కడి కవులతో కలిసి మెలసి కాలక్షేపం చేస్తాడనే గ్యారంటీ ఏముంది?

ఇంట గెల్చినవాడు రచ్చ గెలుస్తాడు. ఇహంమీద అసహ్యం లేకుండా, ఇహంలో ఉన్నన్నాళ్లు అహం లేకుండా, ఇహంలో తాను చేసేది అంతా పరంకోసమే అని గ్రహించి, "కృష్ణార్పణం!" అని నివేదించి, వేడి వేడి కప్పు కాఫీ త్రాగినవాడే గీతాసారం, ఉపనిషత్సారం త్రాగినవాడవుతాడు. ఎందుచేతనంటే, తన జీవితధర్మములను భగవంతుడు అనగా సృష్టికర్త నిర్ణయించిన ప్రకారంగా తనకు భగవంతుడిచ్చిన బుద్ధి బలముకొలదీ నిర్వర్తించడమే జీవితపరమార్థం అని గుర్తించడం కావాలి. "కృష్ణార్పణ మెల్లజీవనము కాదా? కృష్ణవేణమ్మరో!" అని కృష్ణానదిలో దూకండి అని శ్రీకృష్ణుడు బోధించలేదు. మన జీవితప్రకృషి అంతా మనకోసం కాదు. "ధర్మ సంస్థాపనార్థం" అన్నారు. గృహస్థాశ్రమంలో ఉన్నవాడు సంసార భారమును మోయుటమే గృహస్థధర్మమును నిర్వర్తించడం. గృహస్థధర్మం కూడా ధర్మమే. ఆ ధర్మ నిర్వహణకూడా ధర్మ సంస్థాపనమే.

నిద్ర పట్టకపోతే శరీరానికి ఆరోగ్యం చెడుతుంది. ఆరోగ్యధర్మములను గ్రహించి నిద్ర పట్టేటట్లుగా మందు కూడా పుచ్చుకోవాలి. అంతే గాని,

"ఆయువు నూరు వత్సరము;
లందు సగంబు నశించె నిద్రచేః"

అనే మనోవిచారంతో "ఎట్లాగురా! దేవుడా! ఆయువు రోజురోజూ కూ గతించిపోతోంది!" అనే దిగులుతో మనోవ్యాకులంతో మనశ్శాంతి లేకుండా నిద్రపోకుండా ఉండడంవల్ల మనకూ సంసారానికీ, ఉపద్రవం చాలా ఉంది. మన సంసార ధర్మంగాని వ్యవహారధర్మంగాని మనం నిర్వర్తించకపోతే, ప్రపంచం తలక్రిందైపోతుందా? అని ప్రశ్నించేవాళ్లు ఆత్మజ్ఞానం లేనివాళ్లు. సూర్యుని చుట్టూ భూమి అనే గోళం తిరుగుతోంది. తన చుట్టూ తాను 24 గంటల కొకసారి తిరుగుతోంది. 365 రోజుల కొకసారి సూర్యుని చుట్టూ ప్రదక్షిణం చేస్తోంది. భూమి తన ప్రదక్షిణాలు తాను చేయకపోతే, సూర్యునకు లోటువస్తుందా? గ్రహాలు గతులు తప్పకుండా ప్రదక్షిణాలు చేస్తూనే ఉన్నాయి. మనం సూర్యునకు నమస్కారం చేయవలసిందే. ఆ విధంగా మనిషికూడా జీవితంమీద విసువు లేకుండా విరామం లేకుండా అహం అనేది లేకుండా తాను కూడా యీ జగత్తులో ఒక పరమాణువై పరిభ్రమిస్తూ ఉండవలసిందే. ఎందుకో యీ పరిభ్రమణం? ఎవడికి తెలుసు?

ఆయువు ఎన్నాళ్ళనే మీమాంస ఎందుకు? చేయవలసిన ధర్మసాధన చేస్తూఉంటే, యీ జన్మలో కాకపోతే, యింకో జన్మలో తరిస్తాము. "తొలి నే జేసిన పూజాఫలము తెలిసెను" అని గ్రహించగల అవకాశం త్యాగరాజుగారికి లభించింది. ఈ జీవితకాలం పరిమితం అయితే నేమి? మార్చి పరీక్షలో ప్యాస్ కాకపోతే సెప్టెంబరులో ప్యాస్ కావచ్చునన్నారు. ఎన్ని ఛాన్సులైనా ఉన్నాయి విశ్వేశ్వర విశ్వవిద్యాలయంలో.

నూరు సంవత్సరములలో సగము (50 సంవత్సరములు) సుఖంగా ఆరోగ్యంకోసం నిద్రపోవడం కూడా మన ముక్తికొరకైన ధర్మసాధనమే గాని అధర్మం కాదు. యోగనిద్రలో ఉండడమే ఉత్తమ మనిన్నీ సంసారికి సుఖనిద్ర క్షుద్రమనిన్నీ భావించడం మాత్రం భావ్యం కాదు.



# ★ చుట్టాలు ★

(25-వ పేజీ తరువాయి)

యెప్పుడూ రొసరొసలూ, తిక్లేకదా. మీ మేనల్లుడు గణపతిలాంటివాడు కాడులే' అంది.

నేను 'పిన్నిగారూ!' అనబోతూవుంటే 'గారేమిట్రా, పిన్నీ అనరా. అప్పుడే కొత్తయిపోయేన్రా?'

'సరే! పిన్నీ అదుగో నా భార్య అరుణ' అని మా ఆవిణ్ణి చూపెట్టి 'పిన్నికో గది యేర్పాటు చెయ్యి'మని చెప్పేను. ఆవిడ అరుణని కౌగిలించుకుని 'నా తల్లే! మహాలక్ష్మిలాగున్నావే. వొరే గణపతీ; మీ అత్తగారి కాళ్లకి దండం పెట్రా.' అనేసరికి అతడు సాష్టాంగపడ బోతూ వుంటే నేనే వారించి వాళ్లని లోపలికి పంపేను.

ఆ గణపతిని చూస్తే నాకు నవ్వొచ్చింది. బాగా బలిసివున్నాడు. నల్లని నల్లపు మీద పెదవి మధ్యకి చీలి, ఆ చీలికలోంచి వొక అరంగుళం పొడవు పన్ను బయటికొచ్చింది. మీసం బలిసివుంది. బండీగూడు క్రాపింగు. జుట్టు గంటపిడిలాగ ముడివేసేడు. రెండు చేతులకీ మురుగులూ, నాలుగు వేళ్లకీ వుంగరాలూ, మెళ్లో గొలుసూ వున్నాయి. ఒక గ్లాసు మల్లుకంటి మెడ లాల్చీ, పైమీద పెద్దంచుల జల్తారు పట్టువాణీ, వొక జల్తారు పంచా అతని డ్రెస్సు.

సామానులు లోపల పెట్టుకుని, హాలులోకొచ్చి ముగ్గురూ సోఫాల మీద మండీలువేసి కూచున్నారు. నేనూ, అరూ, రెండుకుర్చీలమీద కూచున్నాం. లచ్చమ్మగారు నిర్విప్రవాహంలాగ మాటలారంభించింది. 'వరే సంపత్తూ! యిన్నాళ్లకి నాకళ్లు చల్లబడ్డాయిరా. ఎన్నాళ్లయ్యోయినన్నూ, నీ పెళ్లాన్నీ, పిల్లనీ, చూడ్డానికి బయల్దేరాలనుకుంటే యెప్పటికప్పుడు ఆటంకాలే. ఐనా ఇక్కడికి రావాలంటే: బండీ, బస్సూ, రెయిలూ ఇన్నింటిమీదా ప్రయాణమే. ఆఖరికి తెగేసి చేసుకుని మా చిట్టి గాడికి—గణపతిని చిట్టి అంటాంలే- శెలవలు కూడా కలిసొచ్చేయనీ, కొన్నాళ్లు నీ దగ్గిరుండొచ్చనీ వొచ్చాం. ఇంతకీ నువ్వూ, కోడలూ యేమనుకుంటారో అని అదో భయం' అంటూ వీధిద్వారం వేపు చూస్తూ 'నీ కోసం యెవరో వొచ్చారా బాబూ' అంది.

నేను వెనక్కి చూస్తే విజయం, శారదా, యిద్దరూ వొచ్చి సోఫాలమీద బైఠాయించిన వాళ్లని ఆశ్చర్యంగా చూస్తున్నారు. నేను, లచ్చమ్మ గారితో 'వాళ్లెవళ్ళో కారు. అది నా కూతురు శారద, వాడు నా మేనల్లుడు విజయం. వాళ్ళు ముగ్గురూ నోళ్ళు తెరుచుకుని ఆశ్చర్యంగా, కళ్లు రెప్పవెయ్యకుండా కొంచెంసేపు చూసేరు. అప్పుడు లచ్చమ్మ గారు, 'ఏమిరా సంపత్తూ! నాతో నా వేళాకోళం. నీకు అక్కాలేదు, చెల్లీ లేదు కదా మేనల్లు డెలా వొచ్చేడురా?'

'వాడు మా శాంతికొడుకు.'

'శాంతెవరూ?'

'మా విశ్వంబాబు కూతురు'

'వీడు విశ్వం మనవడా?' అంటే చిన్నావిడ 'ఆయ నెవరే?' అని అడిగింది.

'నీకు తెలీదులే. లక్షింపురం. పేదవాళ్లూ, మనింటికి వొస్తూవుండేవాడు. అతణ్ణి చూసి జాలి వేసిమీ నాన్నా, ఆయనకి తెలీకుండా నేనూ తృణమో పణమో యిస్తూవుండే వాళ్లం.' అన్నది.

దాంట్లో నిజానిజాలు నాకు బాగా తెలియవు. యీలోగా శాంత అక్కడికొచ్చి 'ఏం పిన్నిగారూ! బాగున్నారా?' అంది. 'బాగున్నాం. నువ్వన్నాళ్లయింది యిక్కడికొచ్చి?' 'వెళ్లాళ్లింది. శెలవలికి మా విజయం వొస్తాడు. నన్నూ, మా సత్యాన్నీ రమ్మని అన్నయ్య రాస్తే వొచ్చాను.'

'మరి నీ మొగుడికెలాగ?'

'మా సుబ్బత్త వుంది.'

'అవును పాపం. పేదసంసారం, పూట బత్యం, పుల్లవెలుగూను. కొన్నాళ్లయినా మీ రిక్కడుంటే కర్చు తగ్గుతుంది.'

'ఆ భద్రకాళి అందుకుని 'అవునూ. అందరికీ మనలాగే కొట్టునిండా ధాన్యం, దినుసులూ, యింట్లో పాడీ వుంటాయా యేమిటీ! యెవళ్లు చేసుకున్న కర్మనిబట్టి వాళ్ళరాత.' అంటూ యీ సడింపు మాటలతో మా విజయాన్ని వొక దెబ్బకొట్టినట్టు వాడివేపు తీక్షణంగా వో చూపు విసిరింది. మా విజయానికి కోపం వొచ్చింది కాని నావేపు చూస్తూ వున్నాడు. శారద వాడి చెయ్యిపట్టుకుని వాళ్లవేపు చూస్తూవుంది. ఆ గణపతి యింత సేపూ తెరిచిననోరూ, విప్పినకళ్లూ, ముయ్యకుండా శారదవేపు అదే చూడ్డం. దానికి మొగం యెర్రబడ్డాది, పెదివలు కదులుతున్నాయి.

ఇంక పూరుకుంటే దానికోపం అగ్నిపర్వతంలాగ పైకి వుబుకుతుందని భయపడి, నేను, 'మీ యిద్దరూ లోపలికెళ్లి డ్రెస్సు మార్చుకోండోయ్ పిన్నీ! మీరు ప్రయాణం ధూళిపోయేటట్టు వేణ్ణీళ్ళ స్నానంచేసి కొంచెంసేపు బడలిక తీర్చుకోండి. ఒరే విజయం! నేను క్లబ్బు కెళ్లి కారు పంపించేస్తాను. నువ్వూ, శారదా, మీ అత్తా, అమ్మా, సత్యం, ఆరు గంట షోకి న్యూథియేటరులో 'శోవాడిస్' రన్నవుతూంది: వెళ్ళండి. ఇదిగో—బాక్సు టిక్కెట్లు తెప్పించేను. రాంగోపాలు కో రూపాయి టిక్కట్టు కొనిచ్చి. నేను చేర్మెను కారులో యింటికొచ్చేస్తాను.' అన్నాను.

'అయితే మామయ్యా! మాకోసం చూడకుండా నువ్వూ, చుట్టాలూ భోంచెయ్యండి.' అన్నాడు విజయం.

'అరూ, శాంతా! మీరు తయారవండి. అప్పుడే అయిదయింది. వో పావుగంటలో కారు తిరిగి పంపిస్తాను.' అన్నాను. వాళ్ళు వెళ్లేరు.

లచ్చమ్మ, 'వరే చిట్టీ! బాక్సంటే యేమిట్రా?'

'అంటే పెట్టె.'

'పెట్టెకి టిక్కెట్టేమిట్రా?'

'ఆ టిక్కట్టు వాళ్ళని యెత్తుగా పెట్టెల మీద కూచోబెడతారు.'

'నువ్వెప్పుడేనా అలా కూచున్నావురా?'

'లేదు. భీవుడిపట్టం సినీమాలో మా తాసీల్దారొస్తే యెక్కడా కుర్చీలులేవు. అప్పుడు వో పెద్దపెట్టిమీద దిండ్లు వేసి ఆయన్ని కూచోబెట్టేరు. గొప్పవాళ్ళకి అలాంటి మర్యాదా చేస్తారు.' భద్రమ్మ గారు, 'మనం మాత్రం చేయించుకోలేమూ యేమిటీ? గొప్పలెందుకని వూరుకుంటున్నాం గాని.' అంటూ మూతితిప్పుకుంది. ఇదంతా వింటే నాకు నవ్వొచ్చింది. నేను క్లబ్బు కెళ్లేను.

తిరిగి యేడున్నరకి యింటికొచ్చేను. చుట్టాలని భోజనానికి తయారవమని చెప్పి స్నానంచేసి భోజనాలదగ్గిర కొచ్చేను. లచ్చమ్మగారు తప్ప మిగతా యిద్దరూ నా పంక్తిని కూచున్నారు. ఆవిడ రాత్రి అన్నంతినదు. అంచేత దగ్గిరుండి వంటావిడచేత వలుగురికి సరిపోయే టంత మినపరొట్టె చేయించుకుంది. అది మా కెదురుగా పెట్టించుకుని, ఆవకాయా వొక పక్కెడు, గోంగూర పచ్చడితో సహా, పిచ్చా పాటి మాట్లాడుతూ, అంతా కానిచ్చేసింది. నా పంక్తి యిద్దరూ కూడా గట్టి పట్టే

#  చుట్టాలు 

పట్టేరు. నేను హాలులో కూచుని పేపరు చదువుతున్నాను, సినీమా కెళ్ళిన పార్టీ కోసం చూస్తూను. చుట్టాలు ముగ్గురూ సోఫాలమీద మామూలుగా కూచున్నారు. కొంతసేపైంతరవాత రంగన్న, నూకాలూ, రామీ, వాళ్ళ దగ్గరకొచ్చి మాటలారంభించేరు. వాళ్ళు మా పెరట్లోనే వుంటారు.

రం : అయితే లచ్చుమ్మగోరూ! తమసిట్టి బావుగోరికే టుద్దేగం?

ల : వాడా! మా వూళ్ళో యిస్కూలు పెద్దమాష్టరు

రం : పెద్దమాష్టారే! యెంతమంది మేష్టార్లున్నారమ్మా!

ల : మరోకున్నాడు, మా వాడి చేతికింద.

నూ : అబ్బో! మన బాబుగోరేటి సదివినారమ్మా?

ల : మెట్రిక్లాసుపరీక్షిచ్చేశు (S S L C)

రం : అదేటి పెద సదుబాయేటి?

ల : మావూళ్ళో లేక పోతే, విజానారం పంపించి నెలకి యాభైరూపాయిలు కర్చుపెట్టి పన్నెండేళ్ళుంటేనేగాని అయింది కాదు. ఏం సామాన్యమనుకున్నావా?

భ : అంత చదువుకున్న వాళ్ళు మా వూళ్ళో లేనేలేరు. ఆమాటకొస్తే పెద్దపట్నాల్లోగాని వుండరు

ల : పెద్ద వుద్యోగాలిస్తామంటే నౌకరీ చెయ్యడం పరువు తక్కువని మా వాడొప్పుకోలేదు.

నూ : ఏటమ్మా ఆ వుద్దేగాలు?

ల : అదేమిట్రా ఆ వుద్యోగంచిటీ? నేం జెయ్యనంటే తాసీల్దారుగారు బలవంతం చేసి యిచ్చేరు?

చి : అదా. ఏన్నామరేటరు. నాకొద్దోయి బాబూ అంటే 'నీలాటి చదువుకున్నవాడూ, ఘరానా అసామీ, యీ వూరుకొగుగదా, యీ చుట్టుపట్ల పదివూళ్ళలో యెక్కడా లేడు, నువ్వొద్దంటే యెలాగని' బతిమాలుకుంటే సరేనని రెణ్ణెల్లు చేసేను.

నూ : జీతమెంత బావూ?

చి : జీతం నాకక్కర్లేదని దర్జాగా వొదిలేసేను. వుంటే నెలకి నూరురూపాయిలుండొచ్చు.

రం : ఇప్పుడు తమకెంత జీతమిత్తారు?

చి : (మీసం నులుపుతూ) నాకు జీతమేమిట్రా? నేనే వో మేస్టరుకి నెలకి యాభై రూపాయీలు జీతమిస్తూ వుంటేను. నే నెవరో తెల్సానీకు? ది మేనేజరు అండు హెడ్మాష్టరు ఆఫ్ ది సింగవరం ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూలు.

రం : అయితే తమరు పిల్లలగ్గిర నించి జీతాలు వొసూలు చేస్తారా?

భ : అబ్బే! అలాచేస్తే మా వాడి గొప్పేమిటి?

నూ : తంరు వూరికేనే సదుబు సెప్తారా యేటి?

చి : మరేమిటనుకున్నావూ? అయినా గవర్నమెంటువారు, యింత మంచి పని చేస్తున్నానని నాకు యేడాదికి పదిహేను వొందలిస్తారు.

రం : అలాగా!

రామి : అమ్మా; మన యిజయంబావూ, శారదమ్మగోరూ-ఏటా సదుబూ?- డాక్టరీ సదుబుతున్నారు గదా-ఆ సదుబు గొప్పదా యేటి?

భ : చాల్లే! మాలచదువు. పుళ్ళు కడుగడమే కదూ. మైలాలేదూ. మడీలేదు. సెవాల్నీ, పురిటాళ్ళనీ ముట్టుకుని ఆ గుడ్డల్తోనే యింట్లోకొచ్చి కలిపీడం. లక్షరూపాయిలిచ్చినా అలాంటి చదువు మా చిట్టిగాడికొద్దుబాబూ. అది చదవలేక యీ మేస్టరుపని చెయ్యలేదు. దీనికైనా రెండేళ్లు భీవుడిపట్నంలో పేనింగైతేనేగాని వీల్లేదు తెలుసా?

రా : అయితే మన సంపద బావుగోరెందుకెళ్ళేరు?

భ : అదేమో నాకేం తెలుసమ్మా?

ల : నన్నడిగేడుకాడు. వొద్దురాబాబూ, మనయింటా వంటా లేదని చెప్పిందును. అయినా మన చిట్టిగాడికేం కర్మం-మారాజులాగ వున్న వూళ్ళో వుద్యోగమూ, యిల్లూ, వాకలీ, భూమీ వుండగా. విజయంగాడికంటే యే మాలచదువో చదివితేనేగాని పొట్ట గడవదు.

నూ : లచ్చిమ్మగోరూ! తమకెంత బూముంది?

ల : మాకా? రెండకరాలుంది. అందులో అరయకరం కొబ్బరిచెట్లూ, మామిడిచెట్లూ వేయించేం. మావూరికి తాసీల్దారొస్తే మా చెట్లనించే నీళ్ల కొబ్బరికాయలు పంపిస్తాం. యినస్పెట్రొస్తే మాయింట్లోనే బస. వున్నన్నాళ్ళూ కోరిన పిండివంటల్తో భోజనం పెడతాం, అతడిక్కావలసిన ఆవకాయ కాయలూ, బంగినపిల్లిపళ్లూ మేమే యిస్తాం.

నూ : అబ్బో! పెద్దబూమే. పెద్ద యొగపాయమే.

రామి : ఏవైతేంగాని యిజయం బావుగోరు దిరిసేస్కుంటే అచ్చంగా దొరగోరిలాగుంతారు.

ల : చాల్లే! కిరస్తానీవాడిలాగ బోడిగుండూవాడూను. మా చిట్టిగాడు చూడూ గొప్పాదమంత జుట్టూ, యెంత డాబుగా వుంటాడూ.

ఆసమయంలో సినీమాకెళ్ళిన పార్టీఅంతా వొచ్చేరు. లచ్చుమ్మగారి సభ ముగిసింది. నౌకర్లు పెరట్లో వాళ్లబసకి వెళ్లేరు. అరూ, వాళ్లందరూ భోజనాలకెళ్లేరు. నేను మేడ వరండాలో కూచున్నాను. భోజనాలయ్యాక మా శారదవొచ్చి, 'నాన్నగారూ! వాళ్లంత రూడ్ గా వున్నారేమిటే. మిమ్మల్ని వరే అంటారు. కాకపోతే, అత్తనీ అంత తూలనాడుతున్నారు.' అంటే, 'అమ్మా! వాళ్లు, వాళ్ళవూరుదాటి బయటికి రాలేదు. ఆవూళ్లో వాళ్లే సివిలైజయినవాళ్లు. వాళ్లు చూసిన మహాపట్నం విజయనగరం.' అన్నాను.

'అయినా వాళ్లనిచూస్తే అసహ్యంగా వుంది. ఆదుక్కులాగా గణపతేమిటే. మీసాలూ వాడూ, వాడి క్రాపూ' అన్నాను 'అమ్మా! ఏదోవాళ్లని కొంచం వోరిమితో చూడాలి. గణపతిని కొంచం ఆడించితే మీకూ వూసుపోతుంది'

శారద యేమి టాలోచించిందో 'సరే నాన్నా మేమేంజేసినా మీరేమీ అనుకోకండి' అన్నది

కొన్నాళ్లయింతరవాత వొకనాడు నేను హాలులో కూచునివున్నాను. లచ్చుంపిన్నీ, భద్రక్కా నా దగ్గరకొచ్చి కూచున్నతరవాత, లచ్చుంపిన్ని 'వరే సంపత్తూ! నీతో వోసంగతి మాట్లాడాలిరా. ఇన్నాళ్ళయివొచ్చేం. యెప్పుడు చెప్పాలన్నా ఏదో అడ్డొస్తూంది' అంది.

'ఏమి టాసంగతి?'

'మరేం లేదు. మాకూ మీకూ వున్న సమ్మంధం తెంపేకు. నువ్వు మంచి బుద్ధిమంతుడివి. మా చిట్టిగాడున్నాడుకదూ: మీ శారదా వుంది! అదీ సంగతి' అనేసరికి నాకు ఆశ్చర్యం, నవ్వూ వొచ్చి నోటంట మాట రాలేదు.

అప్పుడు భద్రక్క అందుకుని, 'అన్నయ్యకిమాత్రం తెలీదాయేమిటి? చిట్టిగాడికీ, శారదకీ యీడూజోడూ సరిగ్గా కుదిరేయి. ఇంతకీ, మనకేంలోటుందీ. నిక్షేపంలాంటి సమ్మంధం, 'కో' అంటే కోటిమంది పెద్ద కట్నాలతోకూడా పిల్నివ్వడానికి సిద్ధంగా వున్నారు. అదీగాక మనవాడికి చదువులేదా? వుద్యోగంలేదా? తను తిని మరి పదిమందికి పెట్టే ఆస్తిలేదా? అయినా అన్నయ్యమాత్రం వెనకాముందూ చూడకుండా ఆ దిక్కుమాల్న విజయంగాడిలాంటివాళ్ళకిచ్చి దానిగొంతు కొయ్యస్తాడాయేమిటి?' అంటోంది.

వీళ్లగొంతుకలు చిన్నవికావు, మేడమీద వున్న విజయానికీ, శారదకీ యీ

మాటలన్నీ వినిపించేవుంటాయి.

'అలోచిద్దాంలే' అని నేను మేడమీదికెళ్లేను. అక్కడ శారద, 'బావా! వూరుకో ఆబ్బూట్లతో నీకెందుకు. ఆ యిడియట్, గణపతిగాణ్ణి, వాళ్లనీ వో ఆట ఆడిస్తాను. నువ్వేమీ అనుకోకుండా చూస్తూవుండు, రేపట్నుంచీని.' అంటున్నది.

వంటింట్లోంచిఅరూ, శారదా కూడా లచ్చమ్మగారి పెళ్లిమాటలన్నీ విన్నారు. ఘరటివరండాలోంచి, నౌకర్లు కూడా విన్నారు. రాత్రి నేను మేడవరండాలో మంచంమీద పడుకున్నాను. నౌకర్లు ముగ్గురూ నా దగ్గిరకొచ్చి, 'బాబూ! శారదమ్మగోరి నాయెలుగ్గొడ్డుకిచ్చి కొంప తీత్తారాయేటని'గోల చెయ్యబోతూవుంటే, 'పొండ్రా. అభయమేమీ లేదులెండ'ని చెప్పితే వాళ్ల సంతోషానికి అంతులేదు. అందులో రామి 'యిజయం బావుండగా శారదమ్మగోరికి మరోల్లెందుకూ' అని వెళిపోయింది.

ఇంతలో శాంత వొచ్చి 'అన్నయ్యా! నేనూ విజయం రేపు బయల్దేరి లక్ష్మీపురం వెళ్తాము.' అన్నది.

'ఏమంత అర్జంటూ? బావని నెల రోజులు శెలవుపెట్టి యిక్కడికి రమ్మని రాసేను. అత్తకూడావొస్తుంది.'

'ఏమీ లేదు. యిందాకా లచ్చంపిన్నీ నువ్వూ శారద పెళ్లిమాటలూ...' అని కంట నీళ్లు పెట్టుకుంది.

'ఓసివెర్రిదానా! యిదా నీభయం? నాకు మతిలేదనుకున్నావా యేమిటి? ఏంపరవాలేదులే.' అనేసరికి దాని మొహం వికసించింది.

'అన్నిటికీ నిన్నే నమ్ముకున్నానన్నయ్యా' అంటూ వెళ్లింది. ఆమర్నాడు లచ్చమ్మగారు నన్ను చూసి, 'ఏరా ఘంపస్తూ! యీ శాంతకీ కాపరం, చుట్టు బండలూ యేమీ లేదా యేమిటీ? నీదగ్గిరే దేవుల్లాడుతోంది; అదీ పిల్లలూను. ముసిలి ముండా అత్తగార్ని ఆ మొగుణ్ణీ వొదిలేసి యీ వేషాలేమిటీ? అదిగాక దిక్కుమాల్న దరిద్రుల్ని మనలాంటివాళ్లు చేరదీస్తే మనకేమోసం. పరువూ జప్పరాకాజేస్తారు.' అంటే 'అదంతా నేను చూసుకుంటానులే' అని ఆసంభావణ కట్టేసేను.

మర్రెండురోజులు పోయాక సాయంకాలం కారుమీద శారదా, గణపతీ, లచ్చమ్మా, భద్రక్కా, షికారువెళ్లేరు. తిరిగీ యింటికొచ్చే వాక వాళ్ళ ఆనందానికి అంతులేదు. శారద గణపతిని 'బావా' అని పిలవడం, హాస్యాలు చెయ్యడం ఆరంభించింది. గణపతి మహేంద్రపదవి వొచ్చినట్టూ, యింటికి కాబోయే అల్లుడైనట్టూ పొంగిపోతున్నాడు. ఆ ఆడవాళ్లిద్దరూ మంచి హుషారుగా వున్నారు.

మరోనాడు గణపతి వాళ్ళమ్మమ్మతో 'అమ్మమ్మా! శారదా, విజయంగాడూ చెట్టాపట్టాలు కట్టుకుని తిరుగుతారే. అది చూస్తే నాకళ్లకి కారం రాసినట్టుంటుంది!' అంటున్నాడు. 'వుండరా-వాణ్ణీ, వాళ్లమ్మనీ యీయింట్లోంచి గెంటించే యేర్పాటుచేస్తాను. ఏమే భద్రీ, నేం జెప్పినట్టూ చెయ్యడం రేపణ్ణించీ ఆరంభించు. పొరుగింటి రత్తమ్మగారితో బుజం కలిపేవా, లేదా?'

'ఆః! కలపడమేమిటీ! చూస్తూవుండూ.' అన్నది.

యేదో జరుగుతున్నది. ముందే నాకు తెలిసిందికాబట్టి యేమొచ్చినా వీళ్లే దీనికి కారకులని నేను చల్లగా అన్నీ కనిపెట్టడానికి నిశ్చయించేను. మరోనాడు వుదయం పదిగంటలైంది. గణపతి నున్నగా చలిమిడిముద్దలాగ తలా, మీసం, గడ్డం, గీయించుకుని యింట్లోకి హుషారుగా వొచ్చేడు. నేనూ శారదా వాణ్ణి చూసి నవ్వడం విని వాళ్ళమ్మమ్మ, అమ్మమ్మా హాల్లోకొచ్చి వాణ్ణి చూసేరు. కొంతసేపు నిశ్చేష్టులైంతరవాత, లచ్చమ్మ, 'ఓరి నీ మొహమ్మంట బెట్టా! అదేమిట్రా ఆ చలిమిడిగుండూ నువ్వూనూ? నీకేం పొయ్యేకాలం వొచ్చిందిరా? యిలాంటి వోగాయితప్పని చేసేవూ' అంటూ కోరాలూ, మిరియాలూ నూరుతూవుంటే, వాడు యేమీ తొణక్కుండా 'నీకు తెలీయదులే! తరవాత చెప్తానూరుకో' అన్నాడు.

'ఏం జెప్తావు నీపిండం, నా మొఖమూను? అయేడుపేదో యిప్పుడే యేడవకూడదూ' అని వాళ్లమ్మన్నది.

'అదికాదే! ఆ విజయం క్రాఫింగులాగ చేయించుకోడం యెలాగా అని మన రంగన్న నడిగితే వాడు నాజుట్టు మూడు మెట్లలో వుందనీ, మొదట నున్నగా గొరిగించేస్తే అప్పుడు సమానంగా పెరుగుతుందనీ, బాగా పెరిగింతరవాత ఆలాటి క్రాఫింగు చేయించుకోవొచ్చనీ, మీసం కూడా తీయించేస్తే మంచి బాగా తయారు చేస్తారనీ చెప్పేడు. అంచేత యిలా చేసేను.'

'ఓరి చవట వెధవా! ఆ వెధవ సలహా యివ్వడం, నువ్వాలగ చెయ్యడం యేడిసినట్టేవుంది.' అని భద్రక్కన్నాది.

లచ్చమ్మగారు, 'యింతకీ ఆ విజయంగాడెక్కడ దాపరించేడురా, నీప్రాణాల మీదకి' అని యింకా యేమో అనబోతూవుంటే, శారద గణపతి భుజమ్మీద చెయ్యివేసి, 'బావా! నీకు పెళ్లికళలప్పుడే వొచ్చేశాయి. రా! నేను నీకు స్వయంగా తలంటి నీళ్ళు పోస్తా'నని అక్కణ్ణించి తీసుకెళ్ళి అదీ, రామీ కలిసి వాడికి స్నానంచేయించి మొగాన్ని గోవింద బొట్టుపెట్టి తెచ్చేసరికి వాడి సంతోషానికంతులేదు. అప్పట్నుంచీ గణపతిని నౌకర్లు 'అల్లుడుగారూ' అని పిలవడం ఆరంభించేరు. వాడి బోడితల కప్పడానికి వో ఫెజ్ టోపీ కొన్నాది శారద. నల్లటి పేంటూ, ఎర్రటి కోటూ, ఆకుపచ్చ షర్టూ, కుట్టించి, తెల్లటి టెన్నీసు జోడు కొన్నాది. మొత్తానికి వో బఫూనులాగ డ్రెస్సు చేయించి అందరూ ఆనందిస్తూ వుండేవాళ్ళు. విజయం మాత్రం అందులో కలియలేదు, గడుసువాడు. శారద ప్రతిరోజూ లచ్చమ్మగార్ని భద్రక్కనీ, గణపతినీ, సాయంకాలం వోమారు కారుమీద తిప్పడం, వాళ్ళు పొంగిపోవడం జరుగుతోంది. ఇదంతా నిజమనేగాని, వాళ్ళని గమ్మత్తు చేస్తున్నారని వాళ్ళనుకోలేదు.

ఇంక నాటకమారంభమైంది. శారద రిస్టువాచీ బంగారం గొలుసుతోసహా కనిపించలేదు. ఇల్లంతా వెతికేం. ఎవళ్ళూ అడక్కముందే చుట్టాలు, వాళ్ల పెట్టెమూటలూ విప్పి చూపించేరు. మర్నాడు ఆ రిస్టువాచీ, మా శాంతా, విజయం వుంటున్న గదిలో, వాడి పుస్తకాల వెనకాలనించి తీసేనని భద్రక్కగారు నా చేతికిచ్చి 'అన్నయ్యా! తెలిసిందా దిక్కుమాల్న వాళ్ళనింట్లో చేరనిచ్చినందుకు ఫలితం? యికనైనా వేగం వొదుల్చుకో' అన్నాది.

'చూస్తానులే' అన్నాను.

శాంత యేడుపుకి అంతులేదు. విజయం తలవాల్చుకుని అన్నం తినడం కూడా మానేశాడు. నేను మేడమీద వొక్కణ్ణీవుండగా అరూవొచ్చి, 'ఎప్పుడూ లేంది యిదేం బుద్ధండీ వొదినకీ. అడక్కుండానే విజయానికి వాచీకొన్నాంగామా. దాని గొలుసుకూడా మొన్ననే అర్దరిచ్చాం' అంది.

'నీకు తెలీదూరుకో' అని చెప్పేను.

శాంత వొచ్చి యేడుస్తూ, 'యిదేమిటన్నయ్యా', నా నైజం నీకు తెలీదూ? యీ అపవాదేమిటీ? నేను పిల్లలూ వెళ్ళిపోతాం. విజయం అదృష్టం యెలాగుంటేఅలాగుంటుంది.' అన్నాది.

'తెలివితక్కువగా మాట్లాడకు: వెళ్ళే నేనుగాని, మీ వొదినగారి నిన్నేమేనా అంటేనా? కుక్క లెన్నరుచుకుంటె నీకేం



# ముట్టాలు



గావాలి!' అని దాన్ని పంపించేను.

అకస్మాత్తుగా రత్తమ్మగారు మా యింటికి రావడం మానేసేరు. ఏమండీ రాలేదని మా అవిడ కబురు పెడితే, తీరిక లేదని చెప్పేది. ఇంక చిన్న చిన్న వొస్తువులు మాయమై పోతూ వుండేవి. కొన్ని మా శాంత కొడుకు సత్యం నిక్కరు జేబులోనుంచో, షర్టు జేబులోంచో, లచ్చమ్మగారో, భద్రక్క గారో తీసేవారు. శారదది వొంటి పేట నెక్లెసు వొకటి, రవల వుంగరం వొకటి, నాది పార్కరు కలం వొకటి, యింకా చిన్న పండిగిన్నెలూ, అరూ గాజుల జత వొకటీ కనబడకుండా పోయేయి. లచ్చమ్మగారి దగ్గిర వో చిన్న క్రపెట్టె వుండేది. దాన్ని ఆవిడ ఎప్పుడూ వొదిలేదికాదు. ఆవిడ తప్పితే భద్రక్క దగిరుండేది. 'అదేమిటమ్మా' అని నాకాలడిగితే, 'అది మా దేవుడి పెట్టెరా. వనవ్యాక్షం మే యిద్దరం తప్ప దాన్ని మగవాళ్ళు ముట్టుకున్నా, ఏం కాదు, రామేశ్వరయాత్రలు చేస్తేగాని ఆ పాపం ముమ్మల్నీ, ముట్టుకున్న వాళ్ళనీ వదిలి పోదుతుంది' అనేది. నేను మా శాంతని పంపించలేను సరికదా మా బావకూడా గెంటువెళ్ళి శెలవు పెట్టి వొచ్చాడు. అది చూసి లచ్చమ్మగారూ కూతురూ తెల్లబోయేరు. గణపతి నాపవే లేకుండా బాగా భోంచేసి, సొక్కలతో బాతాకానీ కొట్టూ వుండేవాడు.

రత్తమ్మగారూ, మా ఆవిడ చిన్ననాటి స్నేహితులు. ఆమె భర్త మా వూళ్ళో పెద్ద మిలులో భాగస్తుడూ, మేనేజరూను. మా శారద వొకనాడు రత్తమ్మగారింటికి వెళ్ళి పట్టుబట్టి అడిగితే, భద్రక్క వాళ్ళింటికి రోజూ వెళ్ళి రత్తమ్మగారి గురించి మా శాంత అతినీచంగా మాట్లాడుతుందనీ, యింకా యేవో చెప్పి, చివరికి మేమంటూ యీ వూళ్ళో లేకపోతే రత్తమ్మగారికీ, ఆమె భర్తకూ, ఆధారమే లేదని శాంత అన్నట్టు ఆమెతో చెప్పిందనీ, అందుచేత దూరంగా వుంటే మంచిదని రాలేదని రత్తమ్మగారు చెప్పేరట. శారద యింటికొచ్చి ఆలోచించగా 'ఏం భద్రత్త! ఏమిటి రత్తమ్మగారితో యేమేమో'కూ..., మా శాంత మీద చాడీలు చెప్పేవుట' అనేసరికి కాళికా మూర్తిలాగ లేచిపోయి 'దానికేం సిగ్గులేదే! అనవలసిన మాటలన్నీ మీ అమ్మనీ, అత్తనీ అనేసి మీదు మిక్కిలి నేనన్నానని నామీద చెప్తుందా?' అని యింకేవో అనరాని మాటలన్నీ దులిపి, లచ్చమ్మగారిదగ్గిరకెళ్ళి ఆమెతో యేవో గుసగుసలు చాలాసేపు చేసింది.

నేనుకూడా, శ్రుతి మించిపోతున్నాదని, వీళ్ళని వెంటనే సాగనంపాలని, ఉపాయం ఆలోచిస్తూ హాలులో కూచున్నాను. లచ్చమ్మగారూ, భద్రక్కా వొచ్చి నాదగ్గిర కూచున్నారు. లచ్చమ్మగారు, 'వరే సంపత్తూ! యిన్నాళ్ళయింది. నాకేం చెప్పేవు కావు. ఆకాస్త ముక్కా నీ నోటంట అవుననిపించి వెళ్దాల్నుంది' అన్నది.

'ఏమిటే? ఏం ముక్కా?'

'అదేమిట్రా! ఆ లాగంటావూ. మా చిట్టిగాడికీ, శారదకీ పెళ్ళిమాట. అవు ననుకుంటే నిశ్చయ తాంబూలాలు పుచ్చుకుని వెళదామని వుంది'.

భద్రక్క, 'అన్నయ్య మాత్రం మరోలా గంటాడా యేమిటే!' అదీగాక వాళ్ళిద్దరూ చిలకా గోరింకలాగ యెలా వున్నారో అన్నయ్యమాత్రం చూడలేదూ? అన్నయ్యా! చిట్టిగాడికి శారద ప్రాణమైపోయిందనుకో. వో నిమిషం అది కనబడకపోతే వాడికి వొంటిమీద తెలివే వుండదూ. ఏమైనా సరే! రేపు మంచిరోజూ. ప్రధానం చేసుకుందాం. మీ దంపతులకి జరీచీరా, చాపూ, పిల్లకి అయిదు తులాలు గట్టికంటే జాగు బుటాలు పట్టుచీరా, పట్టురవికా మాతో నే తెచ్చాం.'

నాకు కోపం రాలేదు కాని వాళ్ళ తెలివి తక్కువతనానికి జాలివేసి, 'శారదకి, ఎం. బి. అయిందాకా పెళ్ళి చెయ్యను! అప్పుడు చూసుకోవమ్మ' అన్నాను. దాంతో వాళ్ళిద్దరూ 'బాగా ఆలోచించు. యింతకంటె పెద్దదీ, కలిసొచ్చినదీ, మరో సమ్మంధం రాదని' అన్నారు. 'సరేలే' అని అంతటితో ఆపేసేను.

మర్నాడు వాళ్ళు ప్రయాణం సిద్ధం చేసుకున్నారు. గణపతి శారదని పిలిచి, కారు తెప్పించమని అనలేక అనలేక అన్నాడు. 'బావా కారు పాడైంది. తాపీగా ప్రమాదం లేకుండా వొక వొంటెద్దుబండి మీద వెళ్తే బాగుంటుంది' అని శారద చెప్పింది.

రంగన్న లచ్చమ్మగారితో 'అమ్మా! మీ దేముడి పెట్టె వొమాటు తెరిచి దేవుణ్ని చూపిస్తే దండం పెట్టుకొని తరించుతామమ్మా' అంటే 'మడీ, మైలా, వేళా, పాళా వొద్దుట్రా?' అని తప్పించుకునేది. మర్నాడు గణపతి ఆ బంగారునుగాటు వేసుకుని వొంటెద్దుబండీ తెచ్చేడు. సామానులన్నీ పెట్టించి, శారదని చూసి 'శారదా వెళ్తాను. దయామాత్రం వుంచు' అన్నాడు.

భద్రక్క 'చాలేరా తెలివితక్కువ దద్దమ్మా! యింకా శారదా గీరదాను' అని అనిడా వాళ్ళమ్మా బండీ యెక్కుతూ వున్నా, మాయింట్లో వాళ్ళనీ, సాగనంపడానికొచ్చివున్న రత్తమ్మగార్నీ నానానాటలూ అంటూ వుంటే, లచ్చమ్మగారి చేతుల్లోవున్న చిన్న పెట్టెని రంగన్న అకస్మాత్తుగా తీసి కింద వేసి కొట్టేసరికి అది బద్దలై అందులోంచి పోయిన వొస్తువులన్నీ బయటికొచ్చేయి. 'ఓహో మీ దేముళ్ళమ్మా! తమరు చాలా గొప్పోళ్ళే!' అని రంగన్న అంటూవుంటే వాళ్ళు తిట్లవర్షం కురిపిస్తూ బండీయెక్కి ఆట్టం టుగా తోలించుకుని వెళ్ళేరు. గాలీవానా వెలిసినట్టయింది.

★

(11-వ పేజీ తరువాయి)

ఆరోజునుంచి దెయ్యం తిమ కాలరు పట్టుకుని గుంజుతోందని ఎవరూ ఫిర్యాదు చెయ్యలేదు. కాని కొందరు వ్యక్తులు మాత్రం దెయ్యం పూర్తిగా అంతర్థానం కాలేదనీ, నగరంలో దూరదూర ప్రాంతాల్లో కనిపిస్తోనే వుందనీ చెప్పేవారు.

నిజానికి, కొలొమెన్ ప్రాంతంలో ఒక పహరావాడు ఒక యింటివెనకనుంచి దెయ్యం నడిచిరావడం స్వయంగా స్వీయ నేత్రాలతో చూశాడు. కాని అతడు అంత బలిష్ఠుడు కాకపోవడం మూలాన దెయ్యాన్ని అరెస్టు చెయ్యడానికి భయపడ్డాడు. చీకట్లోనే కొంతదూరం దెయ్యాన్ని అనుసరించాడు. కాసేపయిన తరవాత దెయ్యం వెనక్కి తిరిగి, బ్రతికి వున్న మనిషెవడికీ వుండనంత పెద్ద పిడికిలి చూపించి "ఎందుకు నావెంట వస్తావు?" అని అడిగింది. పహరావాడు "వూరికేనే" అని మాత్రం అని తక్షణం వెనక్కి పరిగెత్తాడు. అయితే యీ దెయ్యం చాలా పొడుగ్గా వుందట; పెద్దపెద్ద మీసాలున్నాయట; ఓబుకోవ్ వంతెనవైపుగా నడిచిపోయి చీకటిరాత్రిలో కలసిపోయి తిరోహితమైందట.

(సమాప్తం)

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madra